సీతారామారావు, ద్రోణంరాజు

# వేశ్యాహితబోధిని

కాకినాడ, 1920

Record no. 492

## Bibliographic Record Target

సీతారామారావు, ద్రోణంరాజు.
వేశ్యాహితబోధిని / ద్రోణంరాజు సీతారామారావుచే రచియింపఁబడినది.- 3. కూర్పు.- కాకినాడ : కురుకూరి సుబ్బారావు, 1920.
118 p. ;21 cm.
Record no. 492

Sītārāmārāvu, Drōṇaṃrāju.
Vēśyāhitabōdhini / Drōṇaṃrāju Sītārāmārāvucē raciyimpam̐baḍinadi.- 3. kūrpu.- Kākināḍa : Kurukūri Subbārāvu, 1920.
118 p. ;21 cm.
Record no. 492

# వేశ్యాహితబోధిని.



ఇది

మహాభారతసార గ్రంథకర్తయగు

దోణంరాజు సీతారామారావుచే

రచియింపఁబడి



భీమవరోలు కాపురస్థులు బుక్కుశెల్లరునగు



కురుకూరి సుబ్బారావుచే

ప్రచురింపఁబడియె.






... కూర్పు 1000, ప్రతులు.

కాకినాడ:

స్కేప్. అండు కో., ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

1920



[వెల 1—0—0



# వేశ్యాహితబోధిని.

రంగము:—చంద్రవదన:—(గృహములో ప్రవేశము.)

చంద్ర—ఆహా! దిక్కుమాలిన వ్యభిచారమునకు విధివిరామములేక పోవుచున్నది. ఇందులగూర్చి మాతల్లి బలవంతము మరీయెక్కువయ్యెపోయింది. ఏరోజుచూచినా ఆస్తమానందాని నల్లమందుకే రోజుకుఒకరూపాయి కావలసి వస్తూవుంటుంది. ఎంతాకాలని నేను తెచ్చి యివ్వగలను. ఎవ్వరినిజూచ్చి నాముందుగా నాలుగు ఢాబుసరి కబురులు చెప్పడం, తరువాత నాలుగు రోజులు వుండిపోవడమేగాని నమ్మకంగా కొన్నాళ్ళయినా వుంచుకుందామనేవాడు యెవ్వడూ కనిపించడు. వట్టి సరసాలకయితే రోజూ అందరూస్నేహితులే. ఏంచంద్రవదనా యేమిచేస్తున్నావు. పలకరించడానికి వచ్చేవాళ్లేగాని డబ్బుదగ్గిర మాత్రం ప్రాణంతో లంకెవేసుకొనియుంటారు. ఇప్పటికినామనస్సులోవున్న విచారములు కొన్నితగ్గినాయి. ఏమంటేనన్ను షాహుకారు ఒకడు చేరదీసినాడు. ఈయన చాలామంచి వాడున్నూ డబ్బుకోసం వెనుకతీసేవాడున్నూ మాత్రం కాడు అదికాకుండా నేనుయెల్లాచెప్పితేఅల్లావుంటాడు. ఏజోలీజోక్యం అక్కరలేదు. ఇంకనాకు ఫరవాలేదు. నాకూతురుగూడా యిట్టిధనం కలవా

డినే యొకడిని సంపాయిస్తే నాకు మనస్సులో యింకయేవిధ
మయిన చింతావుండదు. కాని, అది నెమ్మదిమీదప్రయత్నం
చేయాలి. నన్నువుంచినషావుకారుకూడా అమ్మాయి విషయం
లో మంచివాళ్ళను ఆలోచించాలనిచెప్పుతూవుంటాడు.ఆయన
చాలామంచివాడు. నాసంతానమును ఆయన కన్న సంతానం
కన్న యెక్కువగా చూచుకొంటూవున్నాడు. మాపిల్లలుయెవ
రయినా అవతలకు వెళ్లితే అసహ్యించుకొనకుండా, తనపిల్లలే
అనుకొని ముత్తిపారవేస్తూవుంటాడు. లోకంలో భోగంవాళ్ళ
ను వుంచుకొన్నవాళ్ళు యెవళ్ళయినా యిల్లాచేసినారా !

తే. గీ. గడచిపోయిన దేదియో | గడచిపోయె
యింకనైనను నేనెప్డు | హీనమతిని
వారివీరిన్నిధనముకై | చేరకుండ
యితనినేనమ్మియుండంగ | నెసగునాకు.

అవును. ఇంకొకరితో నాకు యవసరమేమియున్నది? ఇతడునాకుకా
వలసినంతధనంయిస్తున్నాడు. వంటినిండా నగలుజేయించినాడు. నేను
న్నూ నాపిల్లలున్నూ కూడా బంగారంతో తులతూగుతున్నాము. ఇ
ల్లా మహావైభవంగా వుంటూవున్నప్పుడు మరొకరితో సంబంధంకలు
గజేసికొన్నానంటే యీతడు నాముఖంచూస్తాడా. అదియెంతదోషం.
నేనిప్పుడు గడిస్తున్నధనం తరతరములునామనమరాళ్ళు, నామునిమను
మరాళ్ళు కూడా అనుభవించవచ్చును. కాని నేనెప్పుడూ యింతభాగ్య
వంతుడిని వుంచుకుంటానని అనుకోలేదు. పాపము షావుకారుగారు,
నన్ను మేళములలోకి వెళ్లవద్దని చెప్పుతూవుంటారు కాని, అలవాటు
చేతనున్నూ, మేళమునకు నాయకురాలనై యుండడముచేతనున్నూ,
వెళ్లకుండా వుందామంటే యేమిటోతోచదు. అందుచేతయెప్పుడయినా



కాస్త వెళ్ళుతూవుంటాను (ఎదుటజూచి) అదుగో! సుబ్బయ్యశెట్టిగారు
వస్తూవున్నారు.

[సుబ్బయ్యశెట్టి ప్రవేశము.]

సుబ్బ—(తనలో) ఆహా! నాకీచంద్రవదన నేనుయెంతోపుణ్యంచేసు
కోబట్టి లభించినది గాని సామాన్యులకు లభించేటటువంటిది
గాదు. బ్రాహ్మణులు రంభాసంభోగంకోసం యజ్ఞాలు చేస్తారు
అని చెప్పుతారు. కాని ఆరంభకూడా దీని కాలి గోరుకైనా
పనికిరాదు. నేను యజ్ఞయాగాలు చేయండే యీచంద్రవదన
నాకు లభించినది.

తే. గీ. అట్టిరంభయేనన్నుఁ | గృతార్థుజేయ
చంద్రవదన రూపముదాల్చి | ధాత్రితలమున
జననమందె నటంచును | స్వాంతమందు
దలతుఁ గాకున్న యీసొంపు | గలుగనగునె.

(చంద్రవదనను సమీపించి) ఏమే! ఏం చేస్తూవున్నావు.

చంద్ర—చెయ్యడానికి యేముంది. సరేగానీ, యీవాళమీరు యింత
ఆలస్యంగా వచ్చినారెంచేత?

సుబ్బ—ఈవాళటిరోజున కాస్త కొట్టుదగ్గరవ్యాపారంమోపుగావుండ
డంచేత ఆలస్యమైనది. మరిన్నీ యింతేకాకుండా, మరలపాడు
కాపురస్థుడు నీవెఱుగుదువా. వెంకటరామయ్యగారు యేదో
వ్యవహారంమీద అనగా వ్యవహారమేముందిలే, ధాన్యం తో
లించుకొని వచ్చినారు అవి కాటావేయించడం, ఖరీదుకట్టడం,
దస్తు యివ్వడం మొదలయిన పనులన్నీ తెమలడానికి ఆలస్య
మయినది.

చంద్ర—ఏమిటే! ఆరామయ్యగారు యిక్కడకు వచ్చినారాయేమిటి!
ఎప్పుడు వచ్చినారు. ఇంకా చెప్పరు.

సుబ్బ—నువ్వాయన్ను బాగా యెరుగుదువా యేమిటి!

చంద్రి—ఆయనతో యెప్పుడూ మాట్లాడిరాలేదుగాని, ఆయన మొఖంమాత్రము చాలాసారులు చూచినాను. ఆయనచాలా గ్రంథసాంగుడే.

సుబ్బ—ఏమిటేవు. ఆయనవిషయం చాలాయిదిగా చెప్పుతున్నావు. నీకెల్లా తెలుసునేమిటి?

చంద్రి—మీరెప్పుడూ ఆయనవిషయమై యెరుగనట్లే అడుగుచున్నారు. మన నీలాచలమును కొన్నాళ్ళువుంచుకొనలేదూ.

సుబ్బ—ఆహాహా! నీలాచలం యిప్పుడు యీతనిస్వాధీనములో లేదా యేమిటి?

చంద్రి—యెల్లావుంటుంది. ఆయనయందు విశ్వాసముంచివర్తించింది గనుకనా.

సుబ్బ—ఏంచేసిందేమిట?

చంద్రి—ఎందుకు అడుగుతారు. చెప్పడానికి గూడా సిగ్గవుతూవుంది.

తే. గీ. ఎంతయో ద్రవ్యమిచ్చుచు స్వాంతమందు
భవ్యసత్కృపతో నిజ భార్యకంటె
నెక్కుడుగ జూచుచుండెడు నితని; కన్ను
చాటునన్ బరులగూడంగ సాగెగాదె.

అది యెప్పుడో ఈయన కళ్ళయెదుటపడ్డది. అప్పటినుంచి ఆయనదానియింటికి వెళ్ళడం మత్తుబుచేశాడు.

సుబ్బ—అవును. మరి, అల్లాటిపనులు చేస్తూవుంటే ఆయనకు కోపం రాదూ. ఆయన యేమిఅయినా తక్కువచేశాడు గనుకనా. అన్నివిధాలా ఏదికావలస్తే అది యిస్తూ రాణీకిమల్లె చూస్తూవున్న పెద్దమనిషిని మోసంచేస్తే యెల్లావుంటుంది. అదియేమి కర్మమోగాని యెంతడబ్బుయిస్తూవున్నా వాడితో సంతృప్తి



బొందక, పైగాతిరగడం వేశ్యలలో అందరికీ ఆచారమైయున్నది. అందుచేతనే వేశ్యలను యెవ్వరినీ నమ్ముటకు నీలుపడదని అంతా చెప్పుతారు. విశ్వాసం, నీతిలేనికులం యేదంటే భోగంకులం. అని ధర్మశాస్త్రములలో కూడా చెప్పబడియున్నది.

చంద్రి—(తనలో). ఈయన పైకి వెఱ్ఱిబాగులవాడులాగున కనుపడుతాడుగాని సామాన్యుడుగాడు. వేశ్యలయొక్క మోసములు బాగా తెలిసినాయి. (ప్రకాశముగా) ఏమండోవ్ మీరువరసాగ్గా

వెం.

అందరిని చుట్టబెట్టి అనేస్తున్నారు. దానిఖర్మం అంటె అల్లాకాలిందిగాని అందరిదీ అల్లాగేనా. మీరన్నమాటలకు వప్పుకోవలసిందేగాని మొత్తముమీద చాలామంది నీతిగలవాళ్ళు గూడావున్నారు. ఇంకా సంసారంచేసే ఆడవాళ్ళకంటే మా భోగంవాళ్ళలోనే కాస్తనీతివుంది. ఈకాలంలో సంసారస్త్రీలు మామీద „కాంపిటిషనుకు” వచ్చినారుగదా.

సుబ్బ—ఇదిగో. ఇంకేం. యింగ్లీషుముక్కలు గూడా నేర్చుకుండావు. యెక్కడనేర్చినావు యేమిటి? యింగ్లీషులో వుత్తరాలు వ్రాయగలవా? మనవ్యాపారం బాపతు వుత్తరాలన్నీ నువ్వేవ్రాయరాదూ. కొట్టుదగ్గిర గుమాస్తాయెందుకు నెల 1 కి 15 రూ యిచ్చి.

చంద్రి—సరిలెద్దురూ. మీవేళాకోళాలకు, యెప్పుడూ యిల్లాగే అంటారు. ఖర్మంచాలక నోరుజారింది.

సుబ్బ—కోంపడకుగాని, మన అమ్మాయి యెక్కడవుంది?

చంద్రి—ఏం, ఇప్పుడు అమ్మాయి అవసరంయేమి వచ్చింది?

సుబ్బ—చూడాలి. అమ్మాయితో పనివుంది. దాన్నిచూడడానికి ఒక పెద్దమనిషి వస్తానన్నాడు. బాగాముస్తాబైయుండమని చెప్పు.

చంద్రి—ఎవరబ్బా. ఆపెద్దమనిషి.

సుబ్బ—ఇందాక [illegible] యెవరినిగురించి మనము మాట్లాడుతున్నాము?

చంద్ర—వెంకట్రామయ్యగారా యేమిటి?

సుబ్బ—మరెవ్వరనుకున్నావు?

చంద్ర—ఏమిటీ! ఈసంగతి నాతో చెప్పకనే పోయితిరి. అమ్మా! మీరు యెంతదొంగలండీ. ఆయన యిక్కడకు వస్తాననడానికి యేమికారణము?

సుబ్బ—ఏమి కారణముంది. మనఅమ్మాయి చక్కదనాన్నిగురించి ఆయన విన్నాఁడఁట. వినడమేకాకుండా ఒకసారి చూచినాఁడఁట. అందుమీఁద నెమ్మదిగా నాతో మాట్లాడేటప్పటికి, నేను ఆయన చెప్పిన సంగతులకు వప్పుకున్నాను.

చంద్ర—ఆసంగతులు యేమిటో నేను వినగూడదా యేమిటి?

సుబ్బ—వినగూడకపోవుటేమి. ఏముంది. ఆయన మనపిల్లనువుంచుకొంటానన్నాఁడు. ఆయన సామాన్యుఁడుంగాఁడు. ఒకలక్షరూపాయల ఆస్తిగలవాఁడు. నాతో చాలారోజులనుంచి వ్యాపారం చేస్తున్నాఁడు. పిల్లకేమీ తక్కువయుండదు.

చంద్ర—అవును. అందులో యేమీ సందేహం లేదు. మన అమ్మాయికి యెల్లాటివాడు వస్తాడా అని ఆలోచిస్తున్నాను. అమ్మాయి భాగ్యవశంకొద్దీ యీాయన దొరికినాడు.

సుబ్బ—ఆయన సాధారణంగా అందరికిమల్లే అబద్ధాలుఆడేవాడుకాడు వెనుక, అమ్మాయిని వుంచుకొంటానని ముందు ఆసగల్గించి, కన్నెరికం పెట్టి, ముందు సంతోషపరచి తరువాత మొఖంచాటువేసిన నరసింహారావు మోస్తరుకాదు.

బంట్రోతు—(ప్రవేశించి) అయ్యా! తమకోసం వెంకట్రామయ్యగారు వచ్చియున్నారు.



సుబ్బ—త్వరగా తీసికొనిరా. ఆయనకు అభ్యంతరమ్ము యేముంది, మన వాళ్లే. రమ్మను రమ్మను.

బంట్రోతు—చిత్తం బాబయ్యా.

[వెంకట్రామయ్య ప్రవేశము]

సుబ్బ—ఓహో! వెంకట్రామయ్యగారా! దయచేయండి. మొత్తానికి అన్నమాట తప్పరు.

వెంక—ఎందుకు తప్పవలెను. మీతో చెప్పిన "టైము"కన్న ఒక్క అరఘుంట ఆలస్యమైనది.

సుబ్బ—అంతమాత్రానికేమిలెండి. (చంద్రవదననుచూచి) ఒసే! అమ్మాయిని ఒకసారి యిల్లాపిలువు.

చంద్ర—ఇదిగో. పిలుచుకొనివస్తాను. (నిష్క్రమించి వెంటనే సింహాచలముతోఁ బ్రవేశించును.)

వెంక—(సింహాచలమునుచూచితనలో) ఆహా! ఏమిబ్యూటిఫుల్ గరల్. సుబ్బయ్యశెట్టి చెప్పినదానిలో అబద్ధం యేమీలేదు. అంతా తల్లిమోస్తరే. నేను దీనిని చిన్నప్పుడు చూచినాను. అప్పటికీ యిప్పటికీ చాలా వ్యత్యాసముగానున్నది. ఆడవాళ్ళకువయసు వచ్చినప్పుడెగదా అందం కనపడుతుంది. ఇల్లాటి దివ్యమంగళ స్వరూపాన్ని నాబోటి ధనికులు వుంచాలిగాని లేకపోతే పాడయి పోతుంది. ఇదివరకు నేనువుంచుకొన్న నీలాచలం దీనిఅందచందాల్లో సహస్రాంశమైనను పోలదు. నా "ఏజ్"కి, నాహోదాకు, నాభాగ్యానికి, నాసరసత్వానికి యిది నిశ్చయంగాతగివున్నది. ఎంతడబ్బు వ్యయమైనాసరే దీనిని నాయధీనంలో వుంచుకోవాలి. ఇది మహాబ్రహ్మాండమైన ఖర్చు అవుతుందని అనుకుంటాము గాని నేను కాల్చివేసే "త్రీకాజిల్సుసిగరెట్లు"కు అయ్యే ఖర్చంతయినా దీనిని పోషించడానికిపట్టదు. ఏమైనా

సరే. [illegible]ంచితీరవలెను. నేను వుంచుకోవడం సుబ్బయ్యశెట్టికికూడా చాలాసంతోషమే. అందుకోసమే తఱుచు నాతో యీ సింహాచలాన్నిగుఱించి చెప్పుతూవుంటాడు. నిజంగా దీనియందంముందు యెవ్వరూ సరిరారు.

చ. కన్నుఁగొననో ధరాస్థలినిఁ । గంజదళాక్షుల నెందఱెందఱిన్
మును పెపుడైన నిట్టిపువు । బోఁడిసిఁ గన్నులఁ జూచియుంటినే
మనసిజకాంతయైనరతి । మాఁడ్కిఁ బ్రకాశము నొందుచున్న యీ
వనితను యిట్టిచందమున । వారిజసంభవు డెట్టుచేసెనో.

చ. కలువలుచేత గన్నుఁగవ । కంజముచేత మొగమ్ము; మల్లెలన్
బలువరుసన్; నవీనవిట । పమ్మునమోవినిఁ జంపకచ్ఛదా
వళిని వరాంగకంబులను । వారిజగర్భుఁడు బుట్టజేసి యీ
లలనను నానిమిత్తమెయి । లాస్థలినుంచె నటంచు నెంచెదన్.

ఇటువంటి ,,బ్యూటిఫుల్ యంగ్ లేడి"ని చూస్తేవదలిపెట్టడానికియెవరి "మైండు"ఒప్పుకొనును! దీన్ని చూడగానే నామనస్సంతా చలించుతున్నది. డ్యామ్‌డర్టీ మన్మథుడు తన ,,ఫ్లవర్ యారోస్"ఊరికే పరంపరగా వేశేస్తున్నాడు. వీడి తల్లి బొడ్డుబొక్క. వీడు కాముకులనుచూస్తే బంటికాలిమీద నడుస్తాడు. వీడి బాణాలు తప్పించుకోడానికిమందు యేముంది. ఏంకానాలి, వెలకాంతలకూటమి మేమందు. అట్టిది ధన్యులకు లభించును. ఈవిషయమై కాళిదాసుకూడా తనశృంగారతిలకము ను గ్రంథములో యిల్లా చెప్పినాడు.

శ్లో. గాఢాలింగన పీడితస్తనతటం । స్విద్యత్కపోలస్థలం
సందష్టాధర ముక్తసీత్కృత మభి । భ్రాంత భ్రునృత్యత్కరమ్
చాటుప్రాయవచో విచిత్రమణితై । ర్ఘాతం రుతైశ్చాంకితం
"వేశ్యానాంధృతిధామ పుష్పధనుషః । ప్రాప్నోతిధన్యోరతమ్."

దులంచేత యీసింహాచలాన్ని వుంచుకోవడానికి నేనుసమ్మతించడంచేత



నేను ధన్యుడనే అందులో యిటువంటికాంత నా[illegible]ప్తించడానికి సిద్ధంగా వుండడంచేత నేను మఱింత ధన్యుడను. ఆహా!

సీ. ఎవ్వానియింట నీ । యింతియుండును; నదే
యిందిరాసుందరీ । మందిరంబు
తరుణి నెవ్వాడు । స్మరియించు వాడెపో
సకలసద్విద్యా వి । శారదుండు
దానితో నిరతంబు । సౌఖ్యంబు గాంచుటే
యంచితానంద సా । మ్రాజ్య పదవి
ఈకాంతతో గూడి । యేకాంత మాడుటే
హరిని సేవించిన । యట్టి ఫలము
తే. గీ. గాన; నీసరోజాక్షినిఁ । గంబుకంఠి
గుతుక మడరంగ జేబట్ట । కుంటినేని
మదను డదయుడై శరముల । యెదను బఱపి
జీవముల గొన నెంచడే । చిత్తమందు.

ఏమైనాసరే. సొడబ్బుఅంతా ఖర్చయినాసరే. వున్నాపొలాలన్నీ తాకట్టుకువెళ్ళినాసరే. తుదకు నేను చచ్చినాసరే. నేను దీనినివుంచుకొనక మాననుగాని కొందరు లోకులు యీవిషయమై యెఱింగి నన్ను దూషిస్తారు. అయితేనేం. నేను చేసేకార్యం వారిదూషణ భూషణలకోసం కాదుకదా. స్వసౌఖ్యంకోసం. అందులో సుందరాంగులతో వుండడమే మోక్షమనుకొన్నమోక్షము. అందుకనే కాళిదాసు బాగా ఆలోచించి యిట్లా వ్రాసినాడు.

,,శ్లో. అవిదితసుఖదుఃఖం నిర్గుణం వస్తుకించి
జ్జడమతిరిహ కశ్చిన్మోక్ష ఇత్యాచచక్షే
మమతుమతమనంగస్మేర తారుణ్యఘూర్ణ
న్మదకలమదిరాక్షీ నీవిమోక్షో హి మోక్షః.

అనగా "ము[illegible]నవాళ్ళు కొందరు నిర్గుణమై శాస్త్రసుఖమన్నాయి యనివస్తువును మోక్షమంటారు, గాని నామతాన్నిబట్టి చూడగా సకలకలాప్రవీణమైన కాంతతో నుండుటయే మోక్షము." కాబట్టి మీవరు యెల్లాఅనుకుంటే నాకు యేమిపోతుంది? ఒకళ్ళు నాకుమెవరూపెట్టనక్కరలేదు. కావలిస్తే నేనే ఒకరికి పెట్టుతాను.

సుబ్బ—ఏమిటో వెంకట్రామయ్యగారు మహాఆలోచిస్తున్నారు.

వెంక—సుబ్బయ్య శెట్టిగారూ. ఆలోచనయేమీలేదు. "ఐ యామ్ ఓన్లీ లీసారీ టూసే దట్ గాడ్ హ్యాజ్ నాట్ గివెన్ మి సమ్ మోర్ అయిస్ టూసీదీ బ్యూటీ ఆఫ్ దిస్ సింహాచలం."

సుబ్బ—"డూయూఅప్రీషియేట్ హర్ బ్యూటీ"

వెంక—వైనాట్.

చంద్ర—మీయిద్దరూ యేమిటో ఇంగ్లీషుమాటలాడుకోనడం ప్రారంభించినారు. అదియేమిటో మేము వినకూడదా యేమిటి?

వెంక—నువ్వువినకూడని రహస్యాలు మాకేమివున్నాయి?

సుబ్బ—(చంద్రవదనతో) ఏమే! పంతులుగారు మనసింహాచలాన్ని చూడడానికి వస్తే చూపించనేమిటి?

చంద్ర—ఇదిమరీ బాగుంది. పిల్లవచ్చి యిక్కడనిలుచుంటె యెంతసేపయింది?

సుబ్బ—అవునే, కోప్పడకు. (రహస్యముగా) నేను నెమ్మదిగా అవతలకువెళ్ళుతాను. ఈయన సంగతిసందర్భాలన్నీ నీవెరుగుదువు. అయినా వ్యవహారం అంతా నేనే "రైటు" చేశానులే. (వెంకట్రామయ్యను చూచి) పంతులుగారూ! మీభోజనం అయిందా!

వెంక—అయింది.



సుబ్బ—మీరు చక్కగా మహారాజులు, పెంద్ర[illegible]కారు భోంచేయడానికి వీలు లేదు కదా. కొట్టుదగ్గిరవ్యాపారాలు చూచుకొనివచ్చేటప్పటికి పన్నెండుఘంటలవుతుంది. అప్పుడుస్నానంచేసి భోంచేసేటప్పటికి రెండుఅవుతుంది. మాకోమట్ల యిళ్ళల్లో పగలు రెండుఘంటలకు రాత్రిపదకొండు ఘంటలకున్నూ భోజనాలు అవడం.

వెంక—(నవ్వుచూ) డబ్బుగంధిమీద పడితే ఆకలివుండదుకాదూ.

సుబ్బ—(పిచ్చిమాటగాని డబ్బు వస్తూవుంటే ఆకలి చస్తుందండీ. నేను త్వరగా స్నానంచేసి భోంచేసివస్తాను. ఇక్కడ సేదయచేయండి.

వెంక—ఇందాకటినుంచి నేను మీరుభోంచేశారని నేను అనుకుంటూ మాట్లాడడంలో ఆలస్యంచేశాను. త్వరగా వెళ్ళిభోంచేసిరండి.

సుబ్బ—(నిష్క్రమించును.)

చంద్ర—సింహాచలమూ! తాంబూలం తెచ్చి పంతులుగారికియ్యి.

సింహా—(సిగ్గుపడును)

చంద్ర—సిగ్గుపడుతావెందుకు అమ్మాయీ వెళ్ళి పట్రా.

సింహా—(నిష్క్రమించి వెంటనే తాంబూలపు పళ్ళెముతో ప్రవేశించును.)

చంద్ర—ఇలాతే అమ్మా! (పళ్ళెముపుచ్చుకొని ఆకులురాశి) అమ్మాయీ! ఇవి ఆయనకు యియ్యి.

సింహా—నువ్వియ్యి. (రోసముతో చూచును.)

వెంక—తే. గీ. చిత్తమందున నున్నట్టి సిగ్గుచేత
కాంత కన్నుబొమ్మలను నెత్తగా! సొన్నర్చి
తాంబూలం బీయజాలక దల్లినీయు
మాయనుచుఁ బల్కుచున్నది మగువమిన్న

చంద్ర—నీకింత సిగ్గయితే యెల్లాగ, (వెంకటాద్రయ్యగారిని జూచి) పంతులుగారూ! ఇదుగో తాంబూలము.

వెంక—(పుచ్చుకొని)

తే. గీ. బుజ్జచేతను సింహాచ లంబు తాంబు
లంబు నీయఁగ మదినిర్భ యంబునందె
గాని; దానిహస్తములతోఁ గరుణఁబూని
యిచ్చియుండిన మోదంబు హెచ్చుగాదె.

ఈతాంబూలమే సింహాచలము నాకిచ్చియున్నచో నాసంతోషానికిమితి లేకయుండును గదా!

తే. గీ. ఇంతి తాంబూలమిచ్చుట యెన్నడబ్బు
చపల నయనతో భాషించు చెపుడుగల్గు
కాంతఁ గ[illegible]చ్చు సౌఖ్యంబునెపుడు
గందు; నెనుచు నున్నాడ నానందమెసఁగ.

(తనలో) ఓమనస్సా! కాస్త వోపికబట్టు. నీమనోరథము త్వరలో నేతీర్చుకొంటావులే.

చంద్ర—ఏమిటో! పంతులుగారు దీర్ఘంగాఆలోచిస్తున్నారు?

వెంక—మరేమీ లేదు.

చంద్ర—మీరు యిక్కడికి యేమిపనిమీద వచ్చినారో మేమెఱుగవచ్చునుగదా.

వెంక—ఎప్పుడూ వస్తూనే వుంటాను. ధాన్యం విక్రయంకోసం వచ్చినాను. అవి యీవాళ సుబ్బయ్యగారికొట్లోనే పట్టుబడిపట్టించి వేశాను. లెఖ్ఖ సాయంత్రమన్నా రేపు అన్నా పుచ్చుకొంటాను.

చంద్ర—ఏమాత్ర మేమిటండి?

వెంక—ఏమాత్రము. అయిదువందలపుట్లు.

చంద్ర—ఇవి [illegible] తమసొంతధాన్యమేనా?



వెంక—అవును.

చంద్ర—పంతులుగారూ! కాస్సేపు పడుకుంటారా యేమి[illegible]?

వెంక—పగటినిద్ర యెప్పుడూ అలవాటులేదు. సుబ్బయ్య శెట్టిగారు వస్తే అయినా నేనూ కొట్టుదగ్గిరకు వెళ్ళుతాము.

చంద్ర—సుబ్బయ్యగారితో కొట్టుదగ్గిరకు వెళ్లకపోతే యిక్కడవుండకూడదా యేమిటి? దస్తు వారుయిక్కడకు పంపరా యేమిటి?

వెంక—నేను దస్తుకోసంగాదు వెళ్లడం. పొద్దుపోతుందని.

చంద్ర—ఇక్కడ పొద్దుపోదు కామోసు. ఎందుకుమీరుశ్రమపడడం ఇక్కడ వుండండి.

వెంక—పోనీ! ఎక్కడనయితేనేమి? యిక్కడే వుంటాను.

చంద్ర—పంతులుగారూ, మీరు మా చెడ్డవారండీ. మీహృదయము సముద్రముకంటె లోతుగల[illegible]. మీరువచ్చిన కార్యాన్నిగురించి కాస్తయినా మాట్లాడకయున్నారు కదా.

వెంక—నే నేకార్యంమీద వచ్చినాను?

చంద్ర—ఆసంగతి మీరు చెప్పకపోతే సుబ్బయ్య శెట్టిగారు మాకు చెప్పలేదనుకొన్నారా యేమిటి?

వెంక—ఏమిటా సంగతి?

చంద్ర—ఇంకా ఎందుకు దాస్తారు లెండి. సరేగానియ్యండి; [illegible]లాన్ని మీరు వదలివేయడానికి కారణము యేమిటి?

వెంక—చంద్రవదనా! ఆసంగతి నానోటితో యెందుకు చెప్పే? నీవు విన్నావుకదా. మళ్లీ యెందుకు?

తే. గీ. అందమైనట్టి కాంతకా దంచుగాదు
ధనము మిక్కుటంబుగను లే దనుచుగాదు
కాని; చాటుగా నిత్తరులఁ గవయజా[illegible]
యుంటఁ జేఁ బాసినాడ వా లంటి ని[illegible]

అక్కాంతయొద్ద నేను బ్రవేశించినప్పుడు ప్రారంభమున నాతో జేసిన
ప్రమాణానికివ్యతిరేకంగాబ్రవర్తించింది. అదినాకు అసహ్యంపుట్టింది.

తే. గీ. తాను కోరుచుండినయట్టి ద్రవ్యమెంతొ
యిచ్చినాడను; వస్తువుల్ దెచ్చినాడ
గొంతయున్నది యేమిలే కుండఁజేసి
నాఁడ; కాని వంచించె నక్క నాతిమిన్న.

అట్టియెడ దానికిని నాకును మరల సంబంధ ముంచుకొనుట యెట్లు?

తే. గీ. ఎంతధనమిచ్చుచుండిన నింతయేని
తృప్తియనుమాట తనదు మదిం దలపక
జిత్తకార్తిశునకమట్లు చెడదిరుగుట
మొదలుఁబెట్టెను విటకాండ్రు ముదముసంద.

ఇట్టిది నేను కన్నులార చూచి యూరకుండగలనా! నాస్నేహితులెం
దరో యీవిషయమై నాతో ననేకసారులు ప్రశంసించిరిగాని, వారి
మాటల ననేకసారులు త్రోసివేసితిని. ఇట్లుండ నొకసారి యిట్టికృత్య
ము స్వయముగా నాకంటనే పడినది.

తే. గీ. నాటినుండియు; నెప్పుడా బోటికడకు
వెళ్లకుండుటెగాక నా వీధినైన
[illegible]నయెగుచుండుట మానితి నాత్మరోసి
యిట్టివను లెవ్వరికినైన నిష్టమగునె.

ఇంక వేశ్యలజోలికి బోగూడదని మౌనమువహించితిని.

చంద్రి—(తనలో) ఇదియేమిటి? ఈయన యిల్లాచెప్పుచున్నాడు. సు
బ్బయ్యగారీయన సింహాచలాన్ని చేరదీయడానికి ఒప్పుకున్నా
డనా? [illegible] (ప్రకాశముగా) పంతులుగారూ పల్లెవాళ్లు మీ[illegible]
లాటలంమో స్తరుగానే వుంటారనుకొన్నానే యేమిటి?



వెంక—జగమంతా అల్లాగేవుంటారు అని నేను అనలేదుగాని మొత్త
ముమీాదనీకు కోపం వచ్చినాసరే వేశ్యలలోవిశ్వాసంతక్కువ.

చంద్రి—ఎవరో తుచ్ఛపుముండలు విశ్వాసహీనులై యుంటారు. నా
సంగతినేను చెప్పుకోరాదు. తన్నుదా స్తుతించుకొంటే తన్ను
కొన్నట్టే వుంటుందంటారుగాని నాసంగతి తమరు విన్నారో
లేదో, నేనీ సుబ్బయ్యగారిదగ్గరకు వచ్చి పదిహేను సంవత్స
రాలాయింది. ఇక్కడకు వచ్చినతరువాత, వెనుక నన్నువుంచు
కొన్నవాళ్లు యెందరో యీలాగు అనేక కార్యములమీద న
చ్చి, నాకు కబురులు పంపుతుండేవారు కాని, నేను వారికిమ
ళ్లీ సుబ్బయ్యగారి యధీనంలోవున్నాను. తమరాప్రశంస గలు
గజేసుకొనరాదు. వలసినచో దయయుంచినేని నన్ను జూచి
పోండి" అని మరల జవాబులు పంపుచుండేదాన్ని.

వెంక—నీసంగతి నాకు దెలియును. నీకాలిగోరుకైనా తక్కిన వేశ్యలు
పోలుతారా!

చంద్రి—ఈవిధంగానే నాకూతురయిన యీసింహాచలాన్ని కూడా త
గుపెద్దమనుష్యుల వశముజేసి, కీర్తి సంపాయిద్దామని వున్నదా
ననేగాని తక్కిన వేశ్యల మోస్తరుగా దీన్ని త్రిప్పి ధనం సం
పాయిద్దామనే వుద్దేశం లేదు. ఇంతకుముందే [illegible] విషయమై
సుబ్బయ్యగారు నాతో చెప్పినారు. నేను చాలా సంతోషిం
చినాను. మాఅమ్మాయిని తమవశంచేయడానికి అభ్యంతర
మేమీ లేదుకాని, నీలాచలానికి మామీాదయేమి కోపంవ
స్తుందోఅని అనుమానం కాస్తవుంది. అయినా అదినాకు పె
ట్టవలెనా. నేను దానికి పెట్టవలెనా. మాకు కావలసినదల్లా
యిస్తూవున్న సుబ్బయ్యగారు వేయేండ్లకూ బాగుండాలి.

వెంక—మీమీద కోపం రావడానికి నీలాచలాన్ని మీ రేమిచేసినారు? అది బుద్ధిపూర్వకంగా చేసిందిగాన యీపాపము అదే అనుభవిస్తుంది.

చంద్రి—మంచిమాట చెప్పినారు. మేమయినా మిమ్మల్ని అది తెచ్చి యిది తెండని ఘంటఘంటకు యిబ్బంది పెట్టేవాళ్ళము కాము. మాకెంత కావాలి అంత కావాలని మిమ్మడుగను. మీమనస్సును అనుసరించి మాఅమ్మాయి నడుచుకొంటుంది. ఇది అయినా ఆట్టే గడుసుది కాదు.

వెంక.—ఈసంగతి అంతా సుబ్బయ్యగారు నాకుచెప్పినారు. ఆయన చెప్పితే నాకు నమ్మకమే. తక్కిన విషయములలో ఆయన యెల్లా చెప్పితే అల్లాచేస్తాను. వెధవడబ్బు. దానితో ప్రయోజనమేమున్నది? విశ్వాసము, నమ్మకము కావాలి.

చంద్రి—నిజమేనండీ మాసింహాచలంకోసం యెంతమందో కబుర్లు పంపించినారు. నవర్సులు యిస్తాము రెండునవర్సులు యిస్తాము అనేవారు. ఏమయినా సరే యెవ్వరో ఒకరిని నమ్మేటట్లు యీ అమ్మాయిని చేయాలిగాని, యీప్రకారంగా ధనంకోసం కనపడ్డవారితో పంపనని చెప్పేసేదాన్ని.

—ఇది స్థితిగలవాళ్ళకు లక్షణము. నీలాచలందగ్గిర యిల్లాటివి పనికిరావు.

చంద్రి—అస్తమానం ఆసంగతి యెందుకులెండి. అయిపోయినదాన్ని గురించి విచారించరాదు.

వెంక—వెధవముండకోసం విచారమెందుకు?

చంద్రి—తమరువుండడం మరలపాడుగదా. మాఅమ్మాయిని అక్కడకు తీసుకొనివెళ్లుతారా యేమిటి? అల్లాగయితే మాకు కాస కష్టమే.



వెంక—ఎందుకు వెధవపల్లెటూరు. నేనూ యీవూళ్ళోనే వుంటాను. ఈసంగతి సుబ్బయ్యగారితో చెప్పినాను. నేను యెక్కడవుంటేనేమి? ఏమయినా కష్టపడవలెనుగనుకనా. ఎక్కడవున్నా సంవత్సరము అయేటప్పటికి మనధాన్యంగింజలు మనకొస్తాయి.

చంద్రి—అల్లాచెయ్యండి మాకుసంతోషంగా వుంటుంది. పంతులుగారూ. ఇప్పటికి నామనస్సులోవున్న చింతపోయి సంతోషం కలిగినదండీ. మాఅమ్మాయికి యెలాటివారు వస్తారో అని యాలోచిస్తూవున్నందులకు మాపూర్వపుణ్యముకొలది, బ్రాహ్మణులు, రూపవంతులు, భాగ్యవంతులు అయిన మీరు లభించినారు.

వెంక—సరి. సరి. యెంతమాట.

[సుబ్బయ్యప్రవేశము.]

సుబ్బ—పంతులుగారూ! ఎండగావుంది కాస్సేపు పడుకోకపోయినారా.

వెంక—ఇప్పుడేంపడకండీ.

సుబ్బ—అల్లాగయితే కొట్టుదగ్గిరకు వెళ్ళుదామా యేమిటి?

వెంక—మీయిష్టం యెక్కడకురమ్మంటే అక్కడకువస్తాను. అభ్యంతరం యేమీలేదు.

చంద్రి—ఎందుకు, ఆయన్ను కూడా శ్రమపెట్టుతారు.

సుబ్బ—అరిగిపోతారా యేమిటి? అప్పిడే అల్లుడుపక్షము అవలంబించినావు.

వెంక—సుబ్బయ్యగారూ మీరు మాపెద్దవాళ్ళండీ. రండిపోదాము.

చంద్రి—పంతులుగారూ రాత్రిపడకకు యిక్కడికి దయచేయండి.

సుబ్బ—పంతులుగారు యిక్కడికిరాక మరెక్కడకు వెళ్లుతారు? బ్రాహ్మణులు అయిపోయినారు గాని లేకపోతే మావాళ్ళయితే ఇంకోచోటికి వెళ్ళనిస్తానా,

సుబ్బ—(ప్రక్కంచూచి) ఎవడురా అప్పుడూ గుఱ్ఱపుబండి కట్టుమని చెప్పూ. వెంకటా్రమయ్యగారూ రండీ.

(నిష్క్రమించుచున్నారు.)

---

రంగము:—సింహాచలము మందిరములో

[వెంకటా్రమయ్య ప్రవేశము.]

వెంక—ఆహా! నిజంగా యీసింహాచలము నాపూర్వపుణ్యముకొలది సంప్రాప్తించిందిగాని సామాన్యంగా లభించేదికాదు.

తే. గీ. దేవలోకాన రంభాది ♦ దివ్యసతులు
వెలసియుండిరటంచును ♦ వింటిగాని
వనిత కాలిగోరునకైన ♦ వారుబోల
రంచు మానసంబునునే ♦ నెంచువాడ.

దీనికోసం యెంతోమంది వాకిలిముందు జవానులకుమల్లే పడికాపులు గాశారట గాని వాళ్ళందరినీ తృణీకరించివేసింది. నిజంగా నావిషయములో వీళ్ళతో చెప్పడంలో సుబ్బరాయ్యగారు చాలా శ్రమపడినారు ఆయనమూలముననే నేను దీనిజేబట్టు భాగ్యం కలిగింది. దీని సౌంద ర్యం తలచుకొంటే నావళ్ళు ఝల్లుమంటుంది. దీని మొగము పూర్ణ చంద్రుడికిబంకలుపెట్టుతుంది. కన్నులు పద్మాలనుమెక్కిరిస్తూన్నాయి తిలపుష్పం యీమెనాసముతో సరిగాదు. ఆమన్మథుండు అమృతం వుంచి నిర్మించిన దొప్పలతీరున చెవులున్నాయి. ఈమెచేతులు మృణా ళములంతటి పల్లవములు. బంధూకపుష్పం మోస్తరుగా మోవి యుంటుంది. మల్లెపువ్వులతీరున పల్వరస అమరింది. ఆహా! యువకు లయొక్క కామాంధకారం వదలించేసెయ్యడానికి వెన్నెలమోస్తరుగా వుండే దీనినవ్వేచాలింది. ఈకాంతయొక్క ప్రతియవయవము నెత్తికొ నివర్ణించుదామంటే ఒక్కొక్కసంవత్సరముపట్టుతుంది. ఇదంతాయెం



దుకు. చిత్రకారకుండయిన రవివర్మ దీనిని ఒకసారి చూచినాడంటే దీనిబొమ్మగూడా వేసి ప్రతివారికి అందుబాటుగా వుండేటట్టు "సేలు" లో పెట్టుతాడు. ఆతడువ్రాసిన శకుంతలబొమ్మయినా యేమయినా యీసింహాచలానికి సరివస్తుందేమోఅని చూచినాను గాని యెక్కడా అందలేదు. (ఎదుటచూచి) అదిగో! సింహాచలం వస్తూవుంది. ఏమి నడక! ఏమిఠీవి. ఏమిహాసము. ఏమిహొయిదా! ప్రపంచకాన్ని దీనిని భగవంతుడు ఏమహారాజునకో భార్యాగాజేసి మహారాణియని పిలువ బడుచు రాణీవాసమునందువుంచుటకుబదులుగా యిల్లా వేశ్యకులంలో బుట్టించినాడు. అన్నన్నా, నేను పొఱబడ్డాను. దీనికి రాణీవాసముదొ రికితే బాగావుంటుందని అన్నాను. వల్లకాటిరాణీవాసము. రాణీవాస స్త్రీలకు యేమిపేరుమండింది. పేరుగొప్ప వూరుదిబ్బ. రాణీలమను పైకిపేరేగాని వ్యాపారాలుచూస్తే యిక చెప్పనా. లోపలవంటచేసేవా ళ్ళు, బట్టలువుతికే చాకలివాళ్ళు వాళ్ళకుప్రియకాండ్రు.

[సింహాచలము ప్రవేశించును.]

సింహా—(తనలో) ఈబ్రాహ్మణుడు నామోహంలో పడిపోయినాడు. ప్రపంచకంబున నన్నుమించినదియీజగంబునలేదనివున్నాడు. ఎక్కడయినా యిల్లాటివాళ్ళ ప్రాపు బోగమువాళ్ళకు దొరికి తేనే వాళ్లదరిద్రము పోవుట. ఆనీలాచలం నిష్కారణంగా యీయన ప్రాపకం చెడగొట్టుకున్నది. ఆయేడుపేదో రహ స్యంగా యేడవరాదూ. అంత ఈయన కంటపడేటట్టేచెయ్యా లా. చెయ్యనివారెవరు? నేను చెయ్యడములేదూ. గుట్టు యే మయినా బయటికివస్తూవుందా. ఫిడేలువాయించే శ్రీనివాసు లు నాకుగూడ ప్రియుడుగాలేడూ. ఆసంగతి ఈయనచూస్తు న్నాడా. ఇంకా ఈయన మర్లపాటు వెళ్ళుతూవున్న ప్పుడు యెంతమందివస్తూపోతూ వుంటారు. (ఇంచుక యూరకుండి)

మాఅమ్మ నిన్న పిలిచి ఈయననునెమ్మదిగా లాలనచేసి, మేడ కట్టించే మార్గము యేదయినా ఆలోచించమని చెప్పింది. యిప్పుడెల్లాగయినా పంద్రాయెత్తులువేసి ఈయననుఅందుకువప్పుకొనేటట్టు చేస్తాను. భోగంజన్మ యెత్తినతరువాత విటకానిని టోపీలోవేయలేకపోతే నాజన్మయెందుకు? (వెంకట్రామయ్యను సమీపించును.)

వెంక—(చూచి) ఏదేదీ! నావలపులభరణి, నాభాగ్యములపంట, నానోములమూట, నాధనాలరుప్ప, నాపుణ్యములపుంజమువచ్చిందా! నేనువచ్చి చాలాసేపయిందిసుమా. నీకోసం కనిపెట్టుకొని వున్నాను.

సింహా—మీరువచ్చినారని దాసీది చెప్పింది; కాని నేనుతలకునీళ్ళుపోసుకుంటూవున్నాను. అందుచేతఆలస్యమైనది. నన్ను క్షమించాలి.

వెంక—ఎంతమాటన్నావు. నిన్ను నేను క్షమించవలెనా. ఇంతమాత్రానికే! నీవు ఏమి చెయ్యరానిపని చేశావు?

సింహా—చెయ్యరానిపని యేమీ చెయ్యలేదుగాని పెద్దమనుష్యులు మీరువచ్చి కనిపెట్టుకున్నారు. మీహృదయంలో వేరుభావంగా ఆలోచించరని నాకు తెలుసును.

వెంక—చెప్పవు యింకా, తలంటుకొన్నావు. అందుకనే జారుముడివేసినావు. ముంగురులుకూడా రేగియున్నవి.

తే. గీ. వనితసౌందర్య మీక్షింప • వలెనటన్న
అప్పుడే జలకంబాడి • అరముడినిడి
ముంగురుల్ రేగి; యున్నప్డె • ముగుదజూచి
ముదమునందంగవలయును • పురుషుడతివ.

సింహా—చాలులెండి. మీమాటలకేమి. మీరెప్పుడూ యిల్లాగ అంటూనే వుంటారు.



వెంక—నామాట అబద్ధమా?

సింహా—మీదగ్గిరయెవ్వరు మాట్లాడగలరు?

వెంక—సరేగాని, నాకిప్పుడొక దానిమీద మనస్సుపోయింది. ఆకార్యం జేసి నన్ను సంతోషపెట్టుతావా లేదా?

సింహా—అదేమిటి చెప్పండి.

వెంక—మరేమీలేదు. నీవుకష్టపడవలసినది యేమీలేదు. నాకు యిప్పుడు నీసంగీతం వినాలని మనస్సుపోయింది.

సింహా—ఇప్పుడేమిటి యేదీకాని వేళ. రాత్రిపాడుతానులెండి.

వెంక—అందుకనే నాకు కోపంవస్తుంది. మనిషికి రెండు రోగాలట. కూర్చోమంటే వెళ్ళుతాననడం. కాస్తపాడమంటే, నాచేతకాదనడమో లేక ఆనక పాడుతాననడమో. సింహాచలమూ! నాకోరిక నీవు తీర్చకపోతే యెవ్వరుతీరుస్తారు? నీవు సంగీతంలో మంచి విద్యావంతురాలవుకదా. అందుచేత నేను సరదాపడి పాడమంటే ఆనకయేమిటి? రాత్రియేమిటి? పాడడానికి యెప్పుడయితేనేమి? నాసరదా తీర్చు.

సింహా—నేనందుకోసంఅనలేదు. రాత్రితీరుబడిగావుంటాముగదాఅని అన్నాను. మీచిత్తంయిప్పుడుపాడమంటేయిప్పుడేపాడుతాను.

వెంక—మనకు యెప్పుడూ తీరుబడే. నీకు వంటపనిగాని యింటిపనిగాని లేదుకదా. నాకుయింకోవుద్యోగంలేదు. నేను యెప్పుడూ నీయెదుటవుండడమే నాకు గొప్పవుద్యోగము. మళ్ళీ బహుశః రాత్రి నేను మదరాసు వెళ్లుతానేమో కొద్దిగా అక్కడ పని వుంది. వెళ్ళుదామని అనుకొంటూవున్నాను. ఇప్పుడేపాడు. హార్మోనీ నేశ్రుతివేస్తాను. (హార్మోని శ్రుతివేయును.)

సింహా—మీరు పట్టినపట్టు వదలరండీ. కానియ్యండి, మీకుయేరకం యిష్టం. జావళీలా, కృతులా, తరంగాలా, అష్టపదులా.

వెంక — వేధవజానళీలు. మేళాల్లోపాడేవేనా. దిక్కుమాలినవివద్దు. పాడుతూవుంటే సాహిత్యంకనపడాలి, పదిసంగతులూ పడాలి. వచ్చేసంవత్సరానికి నీవు గానసభలోకి యెక్కాలి.

సింహా — అయితే నాకువచ్చినవి పాడుతాను ఒకతరంగము ముందు పాడుతాను.

వెంక — పాడు పాడు. చాలాబాగుంటుంది.

సింహా — (పాడుచున్నది.)

శంకరాభరణం — ఆటతాళం.

శ్రీవాసుదేవప్రభో పాలయమాం॥ శ్రీ॥
సకలహితకర-సరసగుణగణ-నిగమసరసిజ-జయతరసఘన
విగతభవభయ-వినుతసురవర్గ-గగనసువిమల-గరుడవిహారణ॥ శ్రీ॥
సరసిజోదరచరణవిలసిత-సరసనూపురసాధుహితకర-తరళకుం
డలతాండవానన-మురరిపోకిల-మోహనాధవ॥ శ్రీ॥
నిరుపమధ్వని-నికరపావన-మురళికారవమోహితాఖిల-
సురవధూగణసుందరానన-కరివరానన-కాంచనాంబర॥ శ్రీ॥
దివ్యమంగళగోపవేష-దీనపాలనపీతదోష-నవ్యతరనవనీతరసిక
వరసఖాసఖనిఖిలజనక॥ శ్రీ॥
దేవకీవసుదేవతనయ-దేవరాజవిరచితవినయ-దేవనారాయణా
నందతీర్థవిరచితదివ్యగీత॥ శ్రీ

వెంక — శంకరాభరణంలావుంది. మామంచినిండైనరాగం. ఇల్లాచెప్పిన మాటవిని పాడితే నిన్ను ముద్దుపెట్టుకోబుద్ధివేస్తుంది. పదీ స్పంగారసంబంధమైనది స్వరముతోగూడా ఒక్కటిపాడు. నేం గీతవిద్యాదర్పణమంతా నీకు కంఠోపాఠమేకదా. బిలహారిమీద కానియ్యి.



సింహా —

బిలహారి — ఆటతాళం.

ప॥ స్వారి-గాపా-ధాసానిధా-పాధప-మగరిస-సనిధసనా॥ సారి॥
రా,ర-వేణు-గోపబాలా-రాజిత-సలక్షణ-జయశీలా॥ రార॥

1. సా,రిగాపా-మా,గపాధా-రీ,సనీదా-పా,మగారి॥ సారి॥
స్వారసాక్షా-నే,రమేమీ-మా,రుబాధా-కో,ర్వలేరా॥ రార॥

2. సా,రిగగగ్గా,,-,,రిగ-పాప్ప-పప్ప-ప్పా,,-,,ధప
నం,దగోపాలా,,-,, నెవెనెందుబోజా-లా,,-,, నిఇ
సాస్ససస్సా-గరిసని-నిధపా-పధపమ-గగరీ-గపమగ-రిసరిగ॥ సారి॥
విందురారా-సదమతి-మదిలోముదమల-రగనాకెదురుగగదియర॥

3. పపపా-రిరిరీ-గపమగగా-గపమగ-మగరిస్స-రిగరిసనా,,-
పలుమా-రునుగా-రవమునని-బిలచిన-బలుకవు-నలుగకురా,,-
రిసనిధసా,,-మగరిగపా-ధపదరిసా-రిసనిధ-పమగరి॥ సారి॥
కరివరదా,,-మరిమరినా-యధరముగ్రో-లరకని-కరముగ॥ రార॥

4. పా,,-మగరిగ-ధా,,-మగరిగ-సా-మగరిగ-పప్పప్పా,,-
రా,,-నగధర-రా,,-ఘురహర-రా,,-భవహర-రావేరా,,-
గా,,-రీసనిధ-రీ,,-రిసనిధసా-,,-రిసనిద-సస్సస్సా,,-
ఈ,,-మగువను-ఈ-,,లలనను-ఈ,,-భాగసిని-చేకోరా,,-
గారిస-రిరిరీ,,-రీసని-దద్దదా-పామగ-గగ్గ
కోరిక-లింపొందా,,-డెందము-నీయందా-జేరెను-నిక్కా [illegible]
గ్గా,,-సరిగధసా,,-రిసరిగ-సా,,-గరిసని-ధపమగ-రి[illegible]॥ సారి॥
దా,,-మరువకురా,,-కరములు-చే,,-మరిమరి-నినుశర-ణనెదర॥ రా॥

వెంక — ఆహా! యేమిసంగీతము. మొగము యెదుట అనకూడదుగానినా రదుడు,తుంబురుడు,నీయెదుట పనికిరారని చెప్పవలసివచ్చినపు డు,భవాని,గోదావరి,ధనకోటి,నాగరత్నంవీరినియెత్తిడమైందున్న,

సీ. బ్రహ్మకుమారుడు పే గౌరవంబిదియంచు
మానసంబునకు వి భ్రాంతిదోప
సంగీతరసమిట్లు పొంగిపొరలుచుఁ బ్ర
వాహమైనట్లు భా వమునదోప
భువిని శృంగారమే యవతారమెత్తెనా
ధరణినన్నట్లు న చ్చెరువుగాఁగ
కోకిలారవమును శ్రాకటంబుగ గేలి
యొనరించెనంచును మనసుకలుఁగ

తే. గీ. సరసమైనట్టి నీగళ స్వరమునెత్తి
పాట హాయిగాఁ బాడి నా భావమునకు
నంచిత ముదంబుఁ గూర్చితి వతివమిన్న
నిన్ను వర్ణింపఁ దరమానె నిక్కముగను.

నేను యిన్నాళ్ళబట్టీ యేమోఅనుకొన్నాను. గుమ్మ ఖులాసాచేశావే. చూడు సింహాచలమూ, నీదగ్గిరవుంటే వేరేసింహాచల యాత్రికు వెళ్ల నక్కరలేదు. ఈరోజునుంచి నీవు ఒకయేర్పాటుచెయ్యాలి ప్రతిరోజు సాయింత్రం ఒకఘంటనాకు నీగానము వినిపించుతూ వుండాలి.

సింహా—ఇంతేగదా. ఆమాత్రము మీకోరికతీర్చలేనా యేమిటి? కాని సంగీతం పాడడానికి మనస్సు ఖులాసాగావుంటే మరీబాగా వుంటుంది.

వెంక—ఏమీ! నీమనస్సు యెప్పుడూ ఖులాసాగానే వుంటుందిగదా. చింతయేమున్నది? నీకేసంసారపుచింతలేదు. డబ్బుచింతలేదు. సమస్తభారము నావీపుమీద నేను పెట్టుకున్నానుగదా.

సింహా—ఏమికావలస్తే అవియిస్తున్నారు. అందుకుసందేహమేమీ లేదుగాని నామనస్సులో సంతోషం యెల్లాప్రవేశపెట్టారు. నాకు మనస్సులో ఒకదానివిషయమై చింతయున్నది. అదితీరదం



యెల్లాగునాఅని బెంగపెట్టుకొనివున్నాను. మానాయినగారయిన సుబ్బయ్యగారినిగూడా మాఅమ్మ ఈవిషయమైచాలాసారులుఅడిగింది కానియిప్పుడెక్కడఆపనిచెయ్యడం డబ్బుఖర్చుఅన్నారు.

వెంక—అదియేమిటో కాస్తనాచెవిని బడవెయ్యకూడదూ. ఆకోరిక నీకు నేను తీరుస్తానేమో.

సింహా—ఏమిటో. మాట లంటారుగాని తీరా విన్నతరువాత, యిది యేమిట్రా బాబూ అస్తమానము యీసింహాచలము దేనికో దానికి యిబ్బందిపెడ్తూనే వుంటుంది అని అనుకొంటారు.

—సఖీ! నీవు అల్లాచెప్పడం ధర్మంగావుందా! నేనునీవుయెప్పుడేది అడుగుతేఅదియివ్వడంలేదూ. అడగనివికూడా నాకుమోజుపుట్టి కొన్నితేలేదూ. వెనుక నేను చెన్నపట్టణంవెళ్ళినప్పుడుటాకరు అండుసన్సులో రతనాలుచెక్కిన గుళ్ళకంటెయున్నూ, పి. ఆర్ అండుసన్సులో మణులుతాపిన చేతికంకణమున్నూ, రెండూ కలసియెంతఖరీదైనవి రూ 14000 వేలవలేదూ. అవితెచ్చియివ్వలేదూ. అవి నువ్వుతెమ్మంటేనే తెచ్చానా. కాబట్టి నీవుమనస్సులో సందేహించక నీకువున్నకోరికయేదో చెప్పు. సుబ్బయ్యగారు తీర్చేదియేమిటి? నాశక్తికిమించనిదైతే నేనే ప్రయత్నం చేస్తాను. ప్రపంచకంలో నీకన్న నాకుమించినవస్తువు యేదీ లేదు. త్వరగా చెప్పు.

సింహా—అది డబ్బుతోపని మీకుశ్రమయెందుకియ్యనాయని సందేహిస్తున్నాను.

వెంక—డబ్బుతోపనేగదా. అయితేయిబ్బందిలేదు. వెధవడబ్బు. మనము వచ్చేటప్పుడు పట్టుకొనివచ్చినాముగనుకనా చచ్చేటప్పుడు పట్టుకొనివెళ్ళడానికి. డబ్బు ఖర్చుఅవుతుందంటే నేనుఏమాత్రం బెంగపెట్టుకొనేవాడనుగాను, కాబట్టినువ్వు చెప్పవచ్చును.

సింహా—ఏమీ లేదుగాని చాలారోజులనుంచి స్వంతయిల్లువుంటే బాగుంటుందని కోరిక పుట్టింది. యీకోరిక నాకేగాక మాఅమ్మకు గూడా పుట్టింది. పుట్టితేనేమిలాభము? కట్టించేవారెవరని ఆఖరకు మాఅమ్మసాహసంజేసి, సుబ్బయ్యగారిని యీవిషయంలో కదిపితే ఆసంగతియిప్పుడెందుకు మరొకప్పుడు చూతామన్నారు. పోనియ్యండి. ఏమైతేనేమి, మాఅమ్మవస్తువులు మీరుఅమ్మివేసి ఆసొమ్ముతో ఒకమంచియిల్లు కట్టి పెట్టండి. ఈసాయమైనా మీరుచేయండి. వస్తువుల[illegible]మ్మతామంటే సుబ్బయ్యగారు వప్పుకోరు.

వెంక—సింహాచలమూ! నీమాటలు మహాతమాషాగా వున్నాయి. మీవస్తువులు అమ్మి నేనుయిల్లుకట్టించవలెనా! ఆలాచేస్తే నేను చేసేది ఏముంది? నామగతనమేముంది? చేతనైతేకట్టించాలి లేకపోతే ఒకదండంపెట్టి వూరుకోవాలి, అంతేకాని వస్తువులు అమ్మేవాడనుగాను.

సింహా—అల్లాగయితే మాకోరిక యెల్లాతీఋతుంది? ఎన్నాళ్ళు యీ అద్దెకొంపలలోవుంటాము. వెంకటాద్రియ్యగారు వుంచుకొన్న సింహాచలం యీపాడుగుడిసెలోవుంది అంటే నాకుచిన్నతనంగావుంది. మళ్ళీ సుబ్బయ్యగారు చూడబోతే లక్షాధికారి. ఒకయిల్లన్నా యింతవఋకు కట్టించలేదు. యీపాడుకొంపలోనికి మీరు వస్తూవుంటే మాకే చాలా కష్టంగావుంది.

వెంక—మీకన్నమాటేమిటి? నాకూఅల్లాగేయున్నది. ఈవిషయంలో నీవిప్పుడంటేనాతో చెప్పినావుగాని నేనిదివరలో రెండుమూడుసారులు సుబ్బయ్యగారితో మాట్లాడినాను కాని ఆయన యెందుచేతనోగాని అశ్రద్ధచేసినాడు. దానిమీదట నేను అస్తమానంకదుపుతూవుంటే బాగావుండదను. నేనేయీపనిపూర్తిచేస్తే



బాగావుంటుందని యూరుకొన్నాను. కాని నీవిప్పుడు అడగడం మంచిదే. ఇంక నేను యేమాత్రం అశ్రద్ధచేయకుండా రేపటినుంచే మనయిల్లుకట్టించే ప్రయత్నంచేస్తాను. నేను యిల్లు మీకోసంకట్టించినానంటే మనవూళ్లోయెక్కడాలేని పంపిణీవుండాలి. మేడకుముందు "కాను" రావాలి. అదివకమోస్తరు రాజమందిరంలా వుండాలి. లోపల అధమపక్షము యిరువై పెద్దగదులు వుండాలి. బ్రహ్మాండమైనహాలు. అంతారాతిమీద పని చేయించాలి. గోడలన్నీ సీమసిమెంటుతో పనిచేయించాలి. ఇన్నిమాటలతో పనియేమున్నది? ఈవూరుమేడలన్నిటిలోను అగ్రస్థానము వహించాలి.

సింహా—(తనలో) ఈయన నెమ్మదిగా నామాటకు వప్పుకుంటూవున్నాడు. బాగా ఈయనకు నామీద అనురాగం వున్నప్పుడే యీయనను టోపీలోవేయాలి. మేడకట్టించేదాకా అన్నా నా రహస్యసంచారము ఈయనకు తెలియకుండా చేసుకోవాలి. (ప్రకాశముగా) పంతులుగారూ! నోటిమాటలతోనే మాకు మీరు మేడకట్టించేటట్టు వున్నారు. ఇవన్నీ మాటలో క్రియలో కనుపరుస్తారో తెలియకున్నది. అయినా చూతాముగాదూ. మీరు సాధారణంగా అబద్ధంఆడేనారుకారని నాకు తెలుసును గాని వక్కందుకుమాత్రము సందేహిస్తున్నాను. ఇదివరకే మీబంధువులు మీవారుఅంతా చంద్రవదనకూతురును వుంచుకొని, ఆస్తిఅంతా పాడుచేస్తున్నాడని వదంతులు వేయసాగినారు. ఇల్లోవుంటే మేడకట్టించేటప్పుడు మిమ్మల్ని యెవ్వరయినా ఆటంకంపెట్టారేమో అని సందేహంగావుంది. అయినా మీరు ఒకరిని లక్ష్యపెట్టేవారు కారులెండి?

వెంక—సింహాచలం! ఈలాంటిమాటలతో నేమిపనియుంది? అయినా

ఈకాలం ఎవరిసొమ్మువాడు తిన్నా లోకులకు మేడుపే. కాబట్టి కావలసినవన్నీ అనగా డబ్బువగైరాలు నేనుసప్లయిచేస్తాను. లోపాయికారీని నేనువుండి సుబ్బయ్యగారిచేత యీపనిచేయిస్తాను. నాపేరు బైటకురాకుండా వుంటుంది.

సింహా—(తనలో) సుబ్బయ్యగారంటే పైకి వెళ్ళేవాడికిమల్లే వుంటాడుగాని దేవాంతకపువ్యూహాలు. ఈయన మేడకట్టించేవిషయమంతాఆయనమీదపెట్టానంటూవున్నాడు. ఇదేసమయమని తలచి సుబ్బయ్యగారు ఈమేడకాస్తాఆయన టోపీవేయడుగదా కానీ పరవాలేదు. మాఅమ్మవుందిగదా సుబ్బయ్యగారిని బుట్టలోపెట్టడానికి. ఇంతకూ మేడతయారు అయితే చూచుకోవచ్చును. (ప్రకాశముగా) పంతులుగారూ. మీమాటలు నిజమేనా ?

వెంక—ఇంకా సందేహంపడతావు యెందుకు? ఇందుకు నేను తిరిగితే మాతృద్రోహముచేసినట్టే. మేడకట్టించడానికి రూ 40000 లకన్న యెక్కువఅవదుగదా. రేపేగణపతిలాల్ దగ్గరకువెళ్ళి దస్తువిషయమైమాట్లాడిపైసలుచేస్తాను.అతనికి తిరిగిఒకసంవత్సరంలో యిచ్చివేస్తాను. ఈసంగతిరేపు తెముల్చుకొని రాజమండ్రికి వెళ్లి కలపవిషయమై మాట్లాడి కావలసినది పంపమని ఆర్డరుయిచ్చి బజానాయిచ్చివస్తాను.

సింహా—ఏమోమీరు యేంయేర్పాటుచేస్తారో ఈవిషయంలో నాముద్దుచెల్లించాలి. మాకామేడ యేమీవార్సి యివ్వవద్దులెండి. అందులో మేముపుంటేచాలు. వెంకటాద్రియ్యగారు వుంచివసాని మేడఅంటే మీకేఖ్యాతి.

వెంక—నీవాలాటిమాటలనవద్దు. వెధవమేడ. సిద్దైతేనాదికాదా న్నాపైతే నీదికాదా. డబ్బువిషయంలోగాని మరేవిషయంలోగాని నీపట్ల నేను వెనుకంజవేసే వాడినిగాన్ను. నాప్రాణంయిమ్మన్న



ప్పటికీ యిచ్చేస్తాను. పరీక్షచూడాలంటే చూడవచ్చును. మీ ప్రాణాలు కావాలనిచెప్పు. ఇప్పుడే నీముందు కత్తిపీటపెట్టి గొంతుక్కోయ కోసుకుంటాను.

సింహా—మీరు గొంతుక్కోయకోసుకొంటే నాకేమివుంది? మీరుపదికాలాలు బాగావుంటేనే నా అందంచందం వుంటుంది.

వెంక—ఏమోలే. నేను నీకు పుస్తికట్టిన మొగుణ్నా యేమిటి ? వేశ్యలకు అనేకమంది.

సింహా—ఇన్నాళ్ళుబట్టిమీరు యిక్కడవున్నారు. నామనస్సుకనుక్కోలేరుగదా. మేము తక్కినవేశ్యలమోస్తరు అనుకొన్నారు కాబోలు. అల్లా అయినట్టయితే మాయిల్లు బందిలదొడ్డికిమళ్ళేనే వుండును. ఇప్పుడు అంటేఅన్నారుగాని యింకముందు యెప్పుడూ అల్లాఅనవద్దు. మీరు యెంతధనము యిస్తూవున్నా సంతృప్తిపొందక అడ్డమైనచచ్చురాడితో తిరిగి మీప్రాపకం చెడగొట్టుకొన్న నీలాచలం అనుకొన్నారా యేమిటి ?

వెంక—దానిపేరుఎత్తకు. వళ్ళుమండుకొనిపోతుంది. అది నన్ను వదిలిందో నాకు పీడవదలిపోయింది. నువ్వు యేమంటావో అని నేను వేళాకోళానికిఅంటే దానికి కోప్పడుతావుయేమిటి ?

సింహా—నేనేమికోప్పడ్డాను. అవునండీమరి. అస్తమానము మీరుయేదోఒకటి అంటూనేవుంటారు. దిక్కుమాలిన వేశ్యజాతిలోపుట్టబట్టిగదా నన్నుగూడాయిల్లాఅనడానికి కారణమైనది. ఒకవేళ నేను వేశ్యకులంలోపుట్టినా నీచవృత్తిని తిరుగుతాననుకొన్నారు కాబోలు. గులకరాళ్లు వున్నచోటనే మాణిక్యాలు వుంటాయి. బుద్ధితోప్రధానంగాని జాతితో ప్రధానంయేమివుంది. ఏమైనాసరే. నేను మిమ్మల్ని నమ్మినాను. నేను మీచేతులమీదుగానే చావాలి. అందాకా మిమ్మల్ని వదిలిపెట్టను. మీరు

ఒక వేళనన్ను వదలివేస్తే యేసుయ్యో గొయ్యో చూచు
కొంటాను.

వెంక—అన్నా, ఎంతమాటచెప్పినావు. నాశరీరంలో ప్రాణంవున్నంత
మట్టుకు నిన్ను వదలిపెట్టను. నీవుఆవిషయమైసందేహించవద్దు.
(ఇంచుక యూరకుండి) ఇప్పుడీ అనవసరమైన మాటలన్నీ యెం
దుకు. నేను త్వరగా భోంచేసి, సుబ్బయ్యగారిని వెంటబె
ట్టుకొని గణపతిలాలుదగ్గిరకు దస్తువిషయమై మాట్లాడడానికి
వెళ్ళవలెను. రా—

(నిష్క్రమింతురు.)

---

రంగము:—[గణపతిలాలుకొట్టు—ప్రవేశము:—
సుబ్బయ్య—వెంకట్రామయ్య.]

వెంక—సుబ్బయ్యగారూ! ఈవ్యాపారంలో నేనుమిమ్మల్ని నమ్ముకొని
దిగుతున్నాను. తీరామీరు నట్టేటిలోపుట్టి ముంచకూడదు.

సుబ్బ—దేనివిషయమై మీరు యిల్లా చెప్పేతున్నారో యూహించలే
కుండా వున్నాను.

వెంక—మీరేంబెంగపెట్టుకోవద్దు. డబ్బువిషయమై మిమ్మల్ని యేమీ
తొందరపెట్టను. మీరేమీనష్టయిచేయవద్దు. మీరల్లావూరికే
పైగావుంటేచాలు. కట్టించడంవగైరా బందోబస్తులన్నీ మీరు
చేయాలి. కాస్త పెద్దలు. మాకంటె వ్యవహారాలు బాగా తె
లిసినవున్నవారు. నేనీమేడకట్టిస్తున్నట్టు యెవ్వరికీ తెలియకూడ
దు. మీస్వంతపని మోస్తరుగా చేయించాలి.

సుబ్బ—ఎందుకు పంతులూ. నీవుచూస్తావుగదా. నీవుకట్టిస్తున్నట్టు
రెండోకంటివాడికి తెలియనిస్తానేమో మాటలుచెప్పుతే యేం
ప్రయోజనంవుంది.



వెంక—ఇదేంఖర్మం. మనంవచ్చిచాలాసేపయింది. మార్వాడీయింకా
లోపలనుంచి యివతలకు రాడే. (నౌకరునిచూచి) ఏమిరా
మీసేటుగారు లోపల యేంచేస్తున్నారేమిటి?

నౌక—బాబయ్యా! ఇప్పుడే నీళ్ళోసుకొని రొట్టెతింటున్నారు. వస్తా
రు. అయిపోవచ్చింది. కొంతసేపు కూకోండి?

వెంక—కాస్త నువ్వువెళ్ళి చెప్పు.

నౌక—చిత్తము. (నిష్క్రమించును.)

[గణపతిలాల్ ప్రవేశము.]

గణ—ఓహో! పంతుల్‌సాబ్. సాహుకారుసాబ్ ఆయే. రామ్ రామ్.
ఇదర్ బైటో.

వెంక—రామ్. రామ్. పరవాలేదు యిక్కడకూర్చుందాము. ఎక్కడ
యితే నేమివుంది.

సుబ్బ—మీయిల్లుమాకు కొత్తాయేమిటి?

గణ—మీరు నిండాపనియేదో వుండివచ్చినట్లు కన్పడుతుంది.

వెంక—మాతోమీకూ, మీతోమాకూ వ్యవహారాలు లేకుండా
వుంటాయి. పెద్దవ్యవహారంమీదనే వచ్చినాను.

గణ—ఏమిటి. ఆవ్యవహారం.

సుబ్బ—వెంకట్రామయ్యగారూ. మీరు సందేహించనక్కరలేదు. గణ
పతిలాల్‌గారు మనవారే. మనము అర్ధరాత్రివచ్చినా సప్లయి
చేసి పంపేవారే. చెప్పండి.

వెంక—మీదగ్గిరకు మేమెందుకువచ్చివుంటాము? మీకుమాత్రం తెలి
యదా యేమిటి? కొద్దిగా దస్తుకావాలి.

గణ—ఏమాత్రం కావాలి యేమిటి? రెండువేలా మూడువేలా.

వెంక—అబ్బే. పలభై వేలు కావాలి.

గణ—(తనలో) పూరావడ్డీ దొబ్బడానికి యిదేమంచిసమయం. అంత దస్తూ యిప్పుడేకావాలా! పదిపదిహేను రోజులు పోయినతరువాత యియ్యకూడదూ. మరేంలేదుగాని దస్తుకు మహానిక్కచ్చిగావుంది. లడాయిగిరాకీగావుంది. నిన్న నేనే 100 కి 0-14-0 లు వడ్డీచేసి ఎన్మిదివేలుపట్టుకొని వచ్చినాను.

వెంక—మీమాటలకేమిలెండి. ఏదో అప్పటికప్పుడు అవసరంవుండి పట్టుకొనివస్తే పట్రావచ్చును. మీరేమిచేస్తే మాకది అంతా యెందుకు? యీవ్యాపారం మీరుమాకు సప్లయిచేసి పంపించాలి.

గణ—వేరే ఆలోచన మాకు ఏమీలేదు. డబ్బు తక్కువగావుంది. వ్యాపారం యేమీసాగడంలేదు. కాసులు వ్యాపారం తగ్గింది. తగ్గడమేమిటి. అసలేరావడములేదు. ధర పూరాగా పెరిగిపోయింది. పోనీ అల్లాగేసరుకుఒక్కసారిగానే తెప్పించుదామంటే గభీలుమని ధరతగ్గితే వ్యాపారం లుకసానాయిస్తుంది. ఈలా వుంది అయినా మీవిషయం ఆలోచిస్తానులెండి.

వెంక—ఇంకా ఆలోచనయెప్పుడు? మీరుసప్లయి చేయాలనివుంటే యెంతసేపు. మీరు దస్తువిషయంలో యేమీ భయంపడవద్దు. దానికి తగినఆస్తి తణఖావేస్తాను. మనసుబ్బయ్యగారు కూడా సాక్షిసంతకం చేస్తారు. మొత్తము రెండుయేళ్ళల్లోతీర్మానం చేస్తాను. ఏనెలవడ్డీ ఆనెలయిస్తాను. అలా యియ్యకపోతే వడ్డీ అసలులో చేర్చుకొని దానికి కాంపౌండు వడ్డీ యిచ్చుకొంటాము.

గణ—(తనలో) తోవలోకివచ్చినారు. (ప్రకాశముగా) పెద్దమనుష్యుల్ మీరుఅడుగుతూవుంటే సప్లయిచేయకపోతే యేం బాగావుంటుంధి. కాని వడ్డీకాస్త జాస్తీ అవుతుందేమో అని చెప్పడానికి సంషయంగావుంది.



వెంక—వెరనవడ్డీ, ఏమాత్రం అవుతుందేమిటి? కానియ్యండి. అవసరము వచ్చినప్పుడు యేమిచేస్తాము. ముప్పావలాకన్నా యెక్కువ అవుతుందా.

గణ—అల్లా నేనేతెస్తున్నాను. భర్తీఅయితేనే సాధ్యంఅవుతుంది.

వెంక—పోనీలెండి. ఒకపావలాలో సంశయమెందుకు? మీయిష్టప్రకారమే కానిస్తాను.

గణ—మీరు యేమిహామియిస్తారు?

వెంక—మాకు మర్లపాడులో అయిదువందల యకరములు పల్లపుభూమివుంది. అందులో రెండువందల యకరములు తణఖావేస్తాను.

గణ—సుబ్బయ్యగారూ! మీరు మావిషయం బాగా తెలుసును. వీరయినా మాకు నమ్మకమేగాని యెప్పుడేరితో వ్యాపారం చెయ్యలేదు. మేము మరల్‌పాడు వెళ్ళి భూమిచూచుకోవాలా, లేక మీరు చూచినారా మీరుచెప్పితే మాకునమ్మకము.

సుబ్బ—మీరేమీ సందేహించవద్దు ఆయనకు అవసరంవచ్చిందిగాని లేకపోతే మనబోటివాళ్ళకు పదిమందికి ఆయనే పెట్టుబడి పెట్టుతాడు. నేను దస్తావేజుమీద సాక్షిసంతకం చేస్తానుకాదూ.

గణ—దస్తావేజుముసాయిదా మీరు వ్రాయగలరా? అల్లాగయితే యిప్పుడూ వర్జాలులేవని బ్రాహ్మడు చెప్పినాడు.

వెంక—కాగితం కలంసిరాబుడ్డీ యిప్పించండి వ్రాస్తాను. వ్రాసినతరువాత మీరువినండి. యేమయినా మార్పులు కావలస్తేచేదాము లేకపోతే యేప్లీడరుకైనా చూపించవలసిన అవసరము వుంటే చూపిద్దాము.

గణ—[కాగితంవగైరా యిచ్చును.]

వెంక—(వ్రాసి) సుబ్బయ్యగారూ మీరుకూడా వినండి. మతలబు బాగుందేమో.

తణఖాఆస్తి:—మరలపాడులో వుంచుకొన్న యే బీ డిమార్కే-షనులు గల 500 యకరముల పల్లపుభూమిలో ఏ డిమార్కేషనుగల 250 యకరములు రూ 40,000 లకు తణఖా.

ఆన 1907 సం॥ జనేవరి 1 తేదీని బొంబాయికాపురస్తులున్నూ ప్రస్తుతం వాయసపురంలో కాసులువగైరా వ్యాపారంచేసేవారున్నూ అయిన మహారాజశ్రీ గణపతిలాలుగారికి మర్లపాడు గ్రామకాపురస్తుడున్నూ జిరాయితీదారున్నూ అయిన వేశ్యాంగనాప్రియ దివాలా వెంకట్రామయ్య వ్రాసియిచ్చిన తణఖాదస్తావేజు.

ఈరోజున మీవద్ద నాకుమర్లపాడులోవున్న A B డిమార్కేషనుగల 500 యకరముల పల్లపుభూమిలోను ఏ డిమార్కేషనుగల 250 యకరముల భూమి మీవద్ద తణఖావుంచి నాస్వంతఖర్చుల నిమిత్తం 40 వేలరూపాయలు యిందుకువడ్డీ 100 కి రు1-0-0 చొ॥ నిర్ణయించుకొని పోవడమైనది. ఈబాకీ రెండుసంవత్సరముల వాయిదాలో తీర్మానంచేయుటకున్నూ సంవత్సరాంతమందు అయినవడ్డీ 1908 సం॥ జనేవరి 1 తేదీని యిచ్చేటట్టున్నూ అలా యివ్వకపోయిన యెడల వడ్డీ అసలులోచేర్చుకొని వడ్డీకి కాంపౌండువడ్డీ కట్టుకొనవచ్చును. సదరు పొలంలో ఫలసాయములతో మీకు యేమీ నిమిత్తంలేదు. ఒకవేళ రెండుసంవత్సరములు అయినప్పటికీ నేను మీఋణము తీర్చుకోని యెడల సదరు ఆస్తిమీద మీరు దావాతేవచ్చును. ఇందుకు నేనేవిధమయిన అభ్యంతరము పెట్టువాడనుగాను. ఈయాస్తి యింతకు ముందు యెవ్వరికీ తణఖాపెట్టబడి వుండలేదు. ఇది నాసమ్మతిని వ్రాసియిచ్చిన తణఖాదస్తావేజు.

గణ—బాగుంది. ఆనక సాఫువ్రాయించి రేపు రిజిస్టరీచేయిద్దాము.
లెఖ్ఖ రిజిస్ట్రారువారి ఆఫీసులోనే యిచ్చేస్తాను.

వెంక—మంచిది. మేము వెళ్ళివస్తాము. (నిష్క్రమింతురు.)



రంగము:—[గోదావరితీరము:—ప్రవేశము కేశవరావు.]

కేశ—(ఎదుటచూచి) ఏమిటిది. గభుక్కున మెఱుపుమెఱిసినట్లు కనపడ్డది. (పరికించి) ఆ. ఏమిటో అనుకొన్నాను.

ఉత్పలమాలిక.

నిద్దపుఁదళ్కుచెక్కిళుల ° నిగ్గులుదేర్చెడు బద్మరాగపుం
దుద్దులు శ్రీలలీలలకు ° దోడుగగర్ణములన్ ధరించి దా
సద్దునఁ గీరశారికల ° సాఱెకుమీఱుచు గంచుకాంశముల్
బ్రిద్దలుసేయు జన్నెడగు ° బైటబడన్ వలిపంపుబైట దా
దద్దయుదిద్దుకొంచు హిమ ° ధామవిభానన బింబమందొగిన్
గ్రొద్దిగ చంద్రికాధవళ ° కోమలమంజుల మందహాసముల్
ముద్దులుమూటగట్టమొగ ° మోటమునన్ మరువాడితూపులం
దుద్దిని మాపుజూపుకొన ° లోరకనుంగవనుండి వెల్వడన్
బ్రొద్దుటిబిల్లతెమ్మెరల ° పోయినపెన్నెరి మబ్బులాడ సొం
పద్దినకొప్పుడల్ మెయిను ° యారముతోరముగారవింపగా
నద్దిరవల్లులం బెనుచు ° నావనమాధవు రాజ్యలక్ష్మినాన్
ముద్దియయోర్తు బిందెగొని ° పోయెడుగాతమి నీరుదేఱఁగన్.

ఆహా! ఏమిదీ! ఈవిడవస్తూవుంటే ,,సర్ప్రైజ్ '' అవుతూవున్నట్టున్నది. అదిగో! ఆవిడ యీదోవనేవస్తూవుంది. (బాగాచూచి) సరే యెవరో అనుకొన్నాను. ఆముసలాయన పెళ్ళామే. నిజంగా ఈపిడిని చూచినప్పుడు "మైండు" ఒక "సైడు" నుంచి "ఫజిల్" అవుతుంది. వేరొక "సైడ్" నుంచి విచారము వేస్తుంది. ఇటువంటి "బ్యూటిఫుల్ యంగ్ గర్లను" చూస్తూచూస్తూ అటువంటి "ఓల్డు ఫెలో"కి యెల్లాకట్టిపెట్టినారో గదా! ఈపిల్ల తల్లిదండ్రులు, కాస్త డబ్బుకి కక్కుర్తిపడ్డారని తోస్తుంది. లేకపోతే యిల్లాటి నీచకార్యంచేస్తారా!

తే. గీ. తనకుమార్తెరు సౌఖ్యంబు దలపకుండ
వయసు మీఱినవారికిఁ బరిణయంబు
జేసి ; ధనముగై కొనఁజూచు చెనటికెట్టి
శిక్ష జేసినఁ బాపంబు చెందదిలను.

కన్యావిక్రియంచేసేవారికి రెండుతొడలమీదవాత వేసినాపాపము లేదు. ఈలాటిచిన్నపిల్లలనుదెచ్చి, ముసలాళ్ళకిస్తేవీళ్లేమి సౌఖ్యంపడతారు. "యౌవనంవా వనంవా" అన్నారు. ఇందుచేతనే "వరల్డులో డిబాచరీ" యెక్కువైపోయింది. అందుకనే భోగంవాళ్లు ,సంసారులు బయలుదేరి మానోట్లోకూడు పడకొట్టివేశారని' యేడుస్తున్నారు. పాపమీమె మొగుడుకి అరవై పడి అనగా అరవయ్యోయేడు దాటుతుంది. ఈవిడ్ని చూడబోతే పదియేడవయేడన్నా లేదు. ఈవిడ యీమధ్యఆసందాలో ఆవిడో "ఓపెన్" చేసిన స్టుడియోలోకి తరుచు వెళ్ళివస్తుందని విన్నాను. పెద్దమనుష్యులయినా ఆస్టుడియోలో అడుగుపెట్టినారంటే యింకమనవశంగాదు. ఆ"విడో" పెద్దపెద్దవాళ్ళకొంపలే తీసింది. మిస్ట్రెస్ సుందరమ్, మిస్ట్రెస్ సత్యం, మిస్ట్రెస్ సుబ్బన్ ఆర్ ది మెంబర్సు ఆఫ్ దట్ స్టుడియో. ఈవిడకూడా తఱుచు అక్కడకు ,వెళ్లుతూఉండడముచేత, నాకుకాస్త "డౌటు" గానేవుంది. మంచిబుద్ధులంటే అబ్బవుగాని వెధవబుద్ధులెంతసేపులో అబ్బుతాయి. ఆరునెలలు సహవాసంచేస్తేవారు వీరు అవుతారట. నెమ్మదిగా నేను ఈవిడవ్యాపారంకాస్తకనిపెట్టాలి. ఏమిటో నామైండుకూడా కాస్త ఈవిడ బ్యూటీ అట్రాక్టుచేసింది. అదుగో ఆవిడ యిల్లావస్తూవుంది. కూడా యింకో "విడో" కూడా వుండే. దీనమ్మాకడుపుకాలా ఈసమయంలో ఈ వెధవముండయెక్కడ పోగయింది. ఎవరో అనుకొన్నాను. స్టుడియో ప్రొప్రయిటర్ అండ్ మ్యానేజరు అయిన వీరమ్మగారే. కాని ఈవొడ్డున కూర్చొని యేమి ఎఱుగనట్లు ముఖంకడుక్కొంటూ యేమిచెప్పుకుంటారో వింటాను.



[వీరమ్మ, నరసమ్మ బిందెలుపుచ్చుకొని ప్రవేశము.]

వీర—ఏం నరసమ్మా. ఇల్లుదగ్గరయినా కనపడడంలేదు. బొత్తిగా మబ్బులో చంద్రుడువు అయిపోయినావు.

నర—ఏమీలేదమ్మా. ఏమిటో ఆయన రెండు మూడు రోజులనుంచి యెక్కడికీ వెళ్ళడంలేదు. అందుచేత నేనూ యెక్కడకీ కదలడం లేదు.

వీర—పొరుగిళ్ళకువెళ్ళితే భర్తగారు యేవన్నా అంటారాయేమిటి?

నర—పాపమాయనకు యివన్నీ అక్కరలేదు. ఆయన యింటికివచ్చేటప్పటికి కాస్తవండిపెడితేచాలు. నాఅవస్థకుతోడు భర్తగారి దండోరాకూడా వుంటె ఇకఅడగనా.

వీర—నీకేంఅమ్మా. నీయవస్థకేమివచ్చింది? మొగుడు కావలసినంత సంపాదించి తెస్తాడు. ఇంతకంటె యేమికావాలి?

నర—పిన్నిగారూ. అవును ఏమీతక్కువలేదు. ఎవరిబాధలు యెవరికి తెలుస్తాయి? నాకడుపులో యెంతచింతవుందో మీకేం తెలుస్తుంది?

వీర—అవునమ్మా. నీవు నిజంచెప్పినావు. అందచందాలికియేమీ లోటులేదుగాని ,దానికి తగినట్టు ఒక్కటిమాత్రం లోటువచ్చింది. యేం చేస్తాము. ఏఘటానికి యేదిప్రాప్తో అదిఅల్లా జరుగుతూ వుంటుంది.

కేశవ—(తనలో) అమ్మా! మాదగొఛ్ఛేదు వెధవముండ. దీనిని నెమ్మదిగా పాచికవేసి,"స్టూడియో"మెంబరుగా చేరుద్దామని వుద్దేశం.

నర—ఇప్పుడేమనుకుంటే యేం లాభంవుంది? అయిపోయిందిగదా. (విచారించును.)

వీర—విచారించకమ్మా. పిచ్చిదానికిమల్లే వున్నావు.

కేశ—"ఫ్యామిలీ గరల్సు"నుపాచిక వేసి చెడగొట్టడానికిదీనిదగ్గిరవున్న శక్తి మరియొకరిదగ్గిర లేదు.

వీర—చూడు, నరసమ్మా. ఆనక భోజనంచేశాక మాయింటికి ఒకసారివస్తావా! నీతో కొన్నిరహస్యాలు మాట్లాడాలి. అదినీకూ లాభం నాకూలాభం.

నర—అదియేమిటోకాస్త యిప్పుడు చెప్పరాదూ.

వీర—ఇప్పుడు చెప్పడానికి వల్లపడదు. అతిరహస్యం. తరువాత చెప్తానుకాదూ. నామాటవిని ఒక్కసారివద్దూ. ఇంతట్లోకే కాళ్ళు అరిగిపోవు.

నర—అల్లాగే వస్తాను.

వీర—ఈమాట యింటికి వెళ్ళినతరువాత మఱచిపోతావా?

నర—మఱచిపోను తప్పకుండావస్తాను. రండీ నీళ్లుముంచుకొని వెళ్ళుదాము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

కేశ—(తనలో)ఈముండయీనరసమ్మను భోంచేసినతరువాత మధ్యాహ్నం యింటికిరమ్మనమని చెప్పింది. ఏదోబాతాకానీ వేయడానికే ఎవళ్ళో ఒకళ్ళకి దీనికి అతకపెట్టుతుంది. "నాకూ లాభంవుంది నీకూ లాభంవుంది అని యిది చెప్పినమాటల్లోనే తెలిసింది. కానీ; నాకున్నూ, సుబ్బమ్మకున్నూ స్నేహంవుందిగదా. అది మధ్యాహ్నపువేళ వీరమ్మయింటికి వెళ్ళి కాస్సేపు కూర్చోడం పేకాడుకోనడం అలవాటువుంది కాబట్టి ఈవిషయంలో లోతు ఆసుబ్బమ్మద్వారా తీస్తాను.

(నిష్క్రమించును.)



రంగము:—[వీరమ్మయిల్లు, నడవలో సత్యము, సుందరము, సుబ్బమ్మ, వీరమ్మ పేకాట ఆడుతూ కూర్చుందురు.]

వీర—సుందరమూ ఈసారి నువ్వుకలుపు. ఆటసరిగా పడుతుందే[illegible]

సుంద—(పేకకలిపి ముక్కలు వేయును.)

సుబ్బ—ఆట.

వీర—పై ఆట.

సత్య—నాకూ ఆటవుంది.

సుంద—నాల్గవచేతిఆట నాకూవుంది.

సత్య—నువ్వు బాగా ఆలోచించి చెప్పు. ఆట చెప్పి ఓడిపోయినాటంటే నాల్గాటలు యెక్కుతాయి. నిష్కారణం నా ఆట చెడగొట్టకు.

సుంద—పరవాలేదు.

సత్యం—అల్లాగయితే చెప్పు.

సుంద—ఇస్పేటు.

సత్య—సరే. ఆడండి. నీవేదిగడం సుబ్బమ్మా!

(ఆట ఆడుచూ)

సత్య—ఇకఆస్టే ఆడ అవసరంవున్నట్టుతోచదు. మాకు అవుటయిందేమో అనుకొంటాను.

సుబ్బ—తొందరపడి అవుటుకొట్టకో. మన కింకోపట్టు పట్టితేనేగాని అవుటవదు.

సుంద—అవుటయిందో లేదో చూచుకొని చెప్పుతే సేనువూరుకోను.

సుబ్బ—మాకవుటవలేదు, ఆడవో.

సుంద—ఇంకవీరాకు పట్టుతాదు ఇదుగో చూచుకోండి. (అని పేక చూపించును)

సుబ్బ—ఇం[illegible]కెందుకు పారేద్దురుండి.

సుంద—మన ఆఫీసుకు వ్యాపారావిడ అంజనీబాయమ్మ ఒక్కతే తక్కువ వైయింది.

[నరసమ్మ ప్రవేశము.]

వీర—(నరసమ్మనుచూచి) నరసమ్మా! మొత్తానికి అన్నమాట నెగ్గించుకొన్నావు వస్తానన్నావు వచ్చినావు.

నర—నేనాడేది ఒకటి చేసేది ఒకటి కాదు.

వీర—(నరసమ్మ చూడకుండా తక్కిన ముగ్గురుని అవతలకు వెళ్లమని కన్నుగీటుచున్నది.)

సుబ్బ—సుందరమూ, సత్యమూ! రండి ఇంటికాడపనివుంది. మళ్ళీ అయినా వద్దాము. (వెళ్ళబోవుచున్నారు.)

నర—ఇదేమిటి నేనువస్తే మీరంతా వెళ్లుతున్నారు

సుబ్బ—కొద్దిగాపనివుంది. కాళ్ళు నొప్పిపెట్టుతున్నాయి. కూచుని కూచుని.

వీర—వాళ్ళు మళ్ళీవస్తారులే. నువ్వురా యిల్లాకూర్చో.

నర—(కూర్చుండును)

వీర—ఈవాళ యేమి వండినావు?

నర—రోజూ ఏమివండనమ్మా. కూరలుబజారులోమండిపోతున్నాయి గుమ్మడికాయముక్క యెక్కడనుంచోమావారుపట్టుకొనివస్తే పులుసుపెట్టినాను, పప్పువండినాను, ఊరగాయ. ఏమిటో, ఏది తిన్నా కడుపు నిండిపోతుంది.

వీర—నేనూ కూరగాయలుకొనడానికి మహాయిబ్బంది పడుతున్నాను. గాజులుతొడిగించుకొని చాలారోజు లయినట్లున్నదే. గంట గంటకు తొడిగించుకోవడంకన్న, రెండునవర్సులుయిచ్చి కట్టించుకుంటే యెప్పుడూ నిలచివుంటాయి.



నర—ఎల్లావస్తాయి అమ్మా! తక్కువనోములునోచుకొని ఎక్కువఫలములు రమ్మంటే వస్తాయా.

వీర—అవును నిజమే. పాపమెన్నోసార్లు ఆకోమట్లఅబ్బాయి నీవిషయమై చాలా విచారించుతూ నాతో చెప్పుతూవుంటాడు.

నర—ఏకోమట్లబ్బాయి.

వీర—మీాఆయనపురాణం చెప్పుతూవుంటాడే, ఆయింటియజమానుని కొడుకే. పాపము చాలామంచివాడు ఈపనినీచేత కాకాని అంటే చేసితీఱుతాడు. డబ్బులేని నిరుపేదలనుచూస్తే అతనికిమహా జాలివేస్తుంది. అన్నిగుణాలు మంచివేకాని అతనిదగ్గర ఒక్కదుర్గుణంమాత్రంవుంది.

నర—ఆ దుర్గుణం యేమిటి?

వీర—కొద్దిగా తిరుగుబోతు. అయితేనేమి! నిన్ను నమ్మినాను అన్న ఆడదాన్ని సాధారణంగా వదలిపెట్టడు. వళ్ళంతా బంగారం యిల్లంతా బంగారంచేసి వదలుతాడు

నర—డబ్బుగలవాడు గనుక యేపనిచేసినా చేస్తాడు. బాగా చూచిన జ్ఞాపకంలేదు. ఎన్నేళ్ళుంటాయేమిటి? అతని పేరేమిటి?

వీర—నిన్ను చాలాసారులు ఆతడు చూచినాడట. 25 సంవత్సరాలు లోపువాడు, యెర్రగావుంటాడు, గుండ్రమొగము, అందమైనవాడే. చెవులకు దుద్దులు, చేతులకు బంగారపు గొలుసులు, మురుగులు, తోడాలువుంటాయి. నీకుజ్ఞాపకంలేదుగాని చూచేవుంటావు.

నర—ఇప్పుడు జ్ఞాపకంవచ్చింది. అతడా! మహాపోకిరిఅండీ.

వీర—కుఱ్ఱతనంగాని మరోటిగాదు. మాయింటికి తఱచువస్తూనే వుంటాడు. ఈసారివచ్చినప్పుడు చూపిస్తానువుండు.

నర—ఏమిపనివుంది లెండి.

వీర—పిచ్చిదానవులావున్నావు. అలాటివాళ్ల అండవుందంటే ఎంతలాభం అనుకొన్నావు.

నర—వాళ్ళఅండ మనకు యెల్లావస్తుందండీ ?

వీర—వెఱ్ఱిదానవులావున్నావు. నువ్వేమి గ్రహించుకోవడంలేదు. నీ సౌందర్యమే వాళ్లను నీయింటికాడ కుక్కల్లాగు చేస్తుంది.

నర—పోనిస్తురూ. ఎందుకీప్రశంస ?

వీర—నేను యేమో చెప్పుతున్నాననిఅనుకోవద్దు. ఆసుబ్బారావుదయ నీవు సంపాదించు. దీనివలన వచ్చేహాని యేమీలేదు. మీ యింటికాడవ్యవహారం చక్కపెట్టుకోవచ్చు. నిన్నుచూస్తే నాకు చాలాజాలివేస్తూవుండడంచేత చెప్పినాను కాని మరోటికాదు. ఇక్కడవ్యవహారం హరిహరబ్రహ్మలకైనా తెలియదు. నువ్వూఊ అను. నీవళ్ళంతా బంగారంచేస్తాను.

నర—పిన్నిగారూ! నేనిల్లాటి పనులెప్పుడూ యెఱుగను. ఇల్లాటివంటే నాకు చాలాభయమేస్తుంది. ఈపాపంచేయడంవల్ల యిహలోకసౌఖ్యానికి యిదివరకే చెడ్డానుగదా పరలోకసుఖంగూడాలేకపోతుంది. ఎందుకీలాటినీచపుపనులుచేసినలుగురునోట్లోపడడం.

వీర—ఎవ్వరూవినరు. రహస్యంగానే జరుపుకోవచ్చును. ఏవరికైనా తెలిసిందంటే నన్ను తుపాకీవెయ్యి. నీవావిషయమై నీవు సందేహించవద్దు, ఇప్పుడు నిజం నీతోచెప్పుతున్నాను. ఎల్లాగయినా నిన్ను అతనికి లభింపజేస్తే నీకు మూడు నవస్సులుయిచ్చి ముందు మురుగులు చేయిస్తానన్నాడు. ఎన్నాళ్ళయినా ఆయనకష్టపడితే వచ్చిన సొమ్ముపెట్టి నీకుమురుగులు చేయిస్తాడు. ఏమంటావు నామాట నిజమేనా కాదా.

నర—ఏమిటోనండీ. నామనస్సు యిల్లాటి పాపకార్యం చెయ్యడానికి వప్పుకోవడం లేదు, ఏమిచెప్పడానికి నోరు రావడంలేదు,



వీర—నీవిల్లా సందేహిస్తూవుంటే యెప్పటికీ మనతనువు తెల్లవారదు. జన్మమెత్తినదెందుకు? బ్రతికిననాలుగునాళ్లు సౌఖ్యంపొందడానికి. సౌఖ్యంఅనగా నేమిటి? కావలసిన బట్టకట్టుకోవడం కోరుకొన్నవస్తువులు పెట్టుకోవడం. యౌవనుడైన పురుషునితో కాపురంచేయడం. ఈమూడు లేకపోయినతరువాత జన్మవుండేం లేకేం. ఇప్పుడు నాతో పేకఆడుతూవున్న సుబ్బమ్మనుచూచినావా. దానిభర్త చిన్నతనంలోనే పోయినాడు. ఈవూరు వచ్చింది. మొదటదాన్నిచూచినప్పుడు నాకుజాలిచాలా వేసింది. ఇల్లాటివాళ్ళను చూస్తేనాకు జాలివేస్తుందని నేను యిదివరకే నీతోచెప్పివున్నానుగదా. అప్పుడది మాయింటికి వస్తూపోతూవుండేది. నెమ్మదిగా దానికి ఒకమంచి కోమటిప్రాపకం సంపాదించిపెట్టినాను. దానికి యిప్పుడు యేమీలోటులేదు. ఈసంగతి యెవ్వరికీ తెలియదు. నీవు కాబట్టి చెప్పినాను. నీవైనా ఈరహస్యం ఎక్కడా బయలుపెట్టవద్దు. అదివితంతువు. ఈలాటిపనులు చేయడానికి దానికే యెక్కువభయం వుండవలసింది. కడుపూగట్రా వచ్చిందంటే యింకేమయినావుందా. అల్లాటివేమీరాకుండాఅవుషధాలుతిందిలే. నీకల్లాటి అవసరం యేమీ లేదు. దానిచెల్లెలు సత్యం. అదికూడా దానిపురాకృతప్రారబ్ధంకొద్దీ వెధవదియైంది. ఆసత్యాన్నికూడా నీవుచూశావుగదా. దానికి ఒక కరణం ప్రాపకం దొరికింది. దరిద్రవిచ్ఛిత్తయింది. యింకోచెల్లెలువుంది దానిమొగుడున్నాడు. వున్నప్పటికీ యెప్పుడయినా అక్కలను జూడడానికివచ్చి యేనెల్లాళ్ళోవుండి అధమపక్షము రూ 100 లన్నా యేమో సరుగానో పట్టుకొని వెళ్ళుతుంది. గోదావరికి యిద్దరినిరాజమహేంద్రవరం వుంది అక్కడని వాళ్ళవూరువున్నదిలే. తలుచువస్తూనేవుంటుంది. కాబట్టి దీని

వల్ల నీకులాభమేగాని నష్టమేమీ లేదు. నామాట విను. ఇందు
కు ఒప్పుకో.

నర—(తనలో) ఈవిడ చెప్పుతూవున్న మాటనిజమే. పొట్టకూ బట్ట
కూగూడా మొగంవాచివున్నాను. ఈలాటిపనినేను రహస్యం
గాచేస్తే యెవరికి తెలుస్తుంది. ఎవరోకోమటి అని చెప్పుతూ
వుంది. షావుకారు అవటంచేత మరీలాభంవుంది.

వీర—ఏమినామాటకుఒప్పుకొన్నట్టేనా. ఊరికేఆలోచించకు. రేపు
ఆసుబ్బారావును పిలిపిస్తాను. మధ్యాహ్నం రెండుఘంటలకు
యిక్కడకురా.

నర—పిన్నీ. నీవుపెద్దదానవు. నీమాటతీసివేయడానికినేనెంతటిదాన్ని?
నీయిష్టప్రకారమే వస్తాను.

వీర—రేపు రెండుఘంటలకల్లా యిక్కడకురా. అన్ని యేర్పాటులు నే
నుచేస్తాను పద. (నిష్క్రమింతురు.)

---

రంగము:—[సోమయాజులుగారి గృహము సమీపమున-
కేశవరావు ప్రవేశము.]

కేశ—(తనలో) అమ్మఘుండ. ఆవీరమ్మ చూస్తూచూస్తూ వుండగనే
నరసమ్మనుఒడుపేసి రకంలోచేర్చింది. కోమటిసుబ్బారావుకీదీని
కి స్నేహం కలిపిందట. రోజూయిదిమధ్యాహ్నం వీరమ్మయిం
టికి వెళ్ళుతూవుండడం, ఆతడు అక్కడికి రావడంతటస్థిస్తూవుం
దట. ఆసుబ్బారావు యీవిడకు మురుగులు అప్పుడే చేయించి
పెట్టినాడట. ఆచేతికివున్న మురుగులు, చెవులకువున్న తెల్లరా
ళ్ళదుద్దులు ఆతడు చేయించిపెట్టినవేయని సుబ్బమ్మచెప్పింది.
ఈవేటలో ఈవీరమ్మచేరి ఎంతమందికొంపలుతీశేస్తూవుందిరా
బాబూ. ఇక్కడనుంచి దీనిని వెళ్ళగొట్టించేమార్గం చూడాలి



(ఆలోచించి) కాదు. కాదు. వెళ్ళగొట్టించితే నాబోటివాళ్ళకు
కాస్తఆసరా తగ్గుతుంది. కాబట్టి యిదివుంటేనేమంచిది. ఎప్పు
డయినా ఏఅవసరమయినా వస్తుంది. (ఎదుటజూచి) ఇదే సోమ
యాజులుగారి యిల్లు. ఆయన కేమేవూళ్ళల్లోనో వార్షికాలు
వుంటే తెచ్చుకోవడానికి వెళ్ళినాడట. ఇంకాఒకమాసంరోజు
లుదాకా రాడట. ఇప్పుడు నేను నెమ్మదిగా వీరింట్లోకివెళ్ళి నర
సమ్మను ఒడుపెయ్యాలి. ఒప్పుకోకుండావుంటుందా మీదుమి
క్కిలివచ్చిందంటే కోమటివ్యాపారం అంతా తెలిసిందనిడమా
యించి బంధంవేస్తాను. నేనుమాత్రంసామాన్యుడనాయేమిటి?
ఈయింట్లోకూడా రెండోవారులేరు. వారుఒక్కరే కాపురం
వున్నారు. పిలిచి నెమ్మదిగా బాతాఖానీవేస్తాను. (తలుపుగొ
ట్టి) ఏమండోయి సోమయాజులుగారూ. సోమయాజులుగారూ.

(లోపల)

(ఎవరువారు. వారువూళ్ళోలేరు.)

కేశ—తలుపుతీయించండి.

(తలుపు తెరుచును)

నర—వారువూళ్ళోలేరు, అమలాపురంవెళ్ళినారు. ఇంకాపదిపదిహే
నురోజులుదాకా రారు.

కేశ—వారువూళ్ళోలేరనుసంగతి నాకుతెలుసును. నేనుయిప్పుడే అ
మలాపురాన్నుంచి వచ్చినాను. హోటలులో భోంచేసి యిల్లా
వచ్చినాను. నేనువారినిచూచినాను. సుఖంగావున్నానని మీ
తో చెప్పుమన్నారు. మీక్షేమంగూడానన్నుచూచి వారియమ
న్నారు. నేనుయింకా ఇక్కడపదిరోజులు వుంటాను. రాత్రిళ్లు
మాయింటికాడ కావలసినంత జాగావుంది పడుకోమనికూడా
చెప్పినారు.

నర—ఆయనఖులాసాగావున్నారుకదా. ఆవూరు యీవూరు అస్తమానంతిరుగుతూవుంటారు. పెద్దకాలం. ఘింటిపట్టునవుండమంటే వుండరు. పాపము. మీరుభోజనంచేసినారా ?

కేశ—చేసేవచ్చినాను.

నర—బసయెక్కడచేశారు ?

కేశ—మూటాఅది హోటలులోనే పెట్టినాను కాని యెవరైనా చేతిదెబ్బకొట్టుతారేమోయని భయంవేస్తూవుంది. ఆనకయిక్కడకు తెచ్చిపెట్టుకుంటాను మీకేంఅభ్యంతరం లేదుకదా ?

నర—(తనలో) ఈయన యిక్కడమూట పెట్టుకున్నాడంటే అస్తమానం యిక్కడనేవుంటే నావ్యాపారానికి యిబ్బందివస్తుందేమో. వీరమ్మగారింటికి నాలుగురోజులనుంచి వెళ్ళకుండా యింట్లోయెవరూ లేరుకదా అని సుబ్బరావును యిక్కడికే పిలుపిస్తూవున్నాను. ఇక్కడ మూటపెట్టుకోవడానికి వల్లకాదంటే రేపుమాఆయనతో యీయనచెప్పినాడంటే యేమిచీవాట్లుతగులుతాయో. (ప్రకాశముగా) అందులో యేండబ్బుందో యేమిటో. నేనూఒంటరిదాన్ని. తరువాత యెల్లాపోయి యెల్లావచ్చినా కష్టమే.

కేశ—డబ్బుకాదు. మన్నువుంది. అయినామీదయవల్లయీవూళ్ళోవైనాడబ్బుదొంరకాలికాదు. చూడండిమీకేంభయంలేదు. ఇందులోయేమీలేదు, ఏమూలో పడేస్తేవుంటుంది. నేనుఅస్తమానం వూళ్ళోనేప్లీడర్లయింటికివాళ్ళయింటికివెళ్ళుతుండాలిలెండి.

నర—ప్లీడర్లయింటికి వెళ్ళడం యెందుకండీ.

కేశ—నేను "అస్ట్రాలజర్ను" అనగాజ్యోతిష్కుడినిలెండి. అందుచేత వాళ్ళచేతులుచూచి జాతకంచూచి జరిగినవి జరుగనున్నవి చెప్పేశక్తివుంది. ఇదేనావృత్తి.



నర—నాచెయ్యిచూచి చెప్పుతారా. నేనుమాత్రమేమీ డబ్బు యిచ్చుకోలేను.

కేశ—మీయింటికి వచ్చినానుగదా. మీదగ్గిరడబ్బు పుచ్చుకోవాలీ. మీదయవుంటే చాలదా.

నర—లేక లేక మాబోటి బీదవాళ్ళదయేవుండాలీ ?

కేశ—ఏమిటో. మిమ్మల్నిచూస్తే నాకుఅదిఒకమోస్తరు అనురాగం విచారంగూడా వేస్తూవుంది. పాపము. మీరు కోప్పడనంటే చెప్పుతాను. మీరుచక్కగా నవయౌవ్వనములోవున్నారు. మీభర్తగారికి 60 సంవత్సరాలు దాటవచ్చినాయి. మీతల్లిదండ్రులుయెల్లాయిచ్చినారోగాని యీయనకు తెలియకుండి వెధవడబ్బుకోసం యిల్లాపిల్లల గొంతుక్కాయలు కోస్తారు.

నర—(సిగ్గుపడును)

కేశ—ఏమంటారు. నేనన్నమాట నిజమేనా. కాదా. మీరు సిగ్గుపడకండి యిక్కడయెవ్వరూలేరు.

నర—ఇప్పుడదిఅంతా యెందుకులెండి.

కేశ—అదికాదు. నేను మాటవరుసకంటున్నాను. మొగుడితోసౌఖ్యమూ లేదు. పోనీడబ్బా అంతకంటెలేదు. దరిద్రమూ తప్పిందికాదు. నిజంగామీరు నాబోటివాళ్ళను మ్యారియేజ్ చేసుకొంటేయిల్లావుంటుందా.మీరేచెప్పండి. ముక్కచెప్పడానికేమండీ.

నర—అవునండి.

కేశ—అవునాఅండి మరి. నేననేకవూళ్ళు పెద్దపెద్దటౌన్సు, సిటీస్, అనగా కలకత్తా, బొంబాయి, మెడ్రాస్, నెల్లూరు, రాజమండ్రి, కోకినాడ, వైజాగ్, విజయనగర్, మొదలయినవెల్లా వెళ్ళుతుంటానా. ఒకచోట ఒకతమాషాఅయింది. చెప్పితే నవ్వువస్తుంది. ఒకచోటఒకవ్యాపారి ఆవిడ వుంది, ఆవిడ అంతఅంద

మైదికాదుగాని సామాన్యపుఅందకత్తెలలో ఒకర్తె అని చెప్ప
వచ్చును. మంచిఅజానుబాహువు కోమట్లయింట్లో పుట్టవలసిన
మనిషిలెండి. తప్పిదారి అందులో పుట్టింది. భర్త వట్టిఅమా
యకుడు. ఏగోలాఅక్కరలేదు. ఆవిడమొగం చూడగానేనేను
యేమైతేఅయిందని, చెయ్యిచూచి, కంకణగ్రామంలో రైలు
యిలాకా ఒకవుద్యోగస్థునికిన్నీ, ఒకతపాలాఫీసు వుద్యోగస్థున
కిన్నీ, మీకూస్నేహంవున్నదని చెప్పేశాను. దానితోడంగెత్తి
పోయి నిజమే, నిజమే, ఈరహస్యం యెవ్వరితోను చెప్పవద్దని
కాళ్ళమీదపడ్డది. అంతేకాకుండానన్నుగూడాటోపీలోవేయా
లని ప్రయత్నంచేసింది. నేను వప్పుకుంటానూ. నేను "బ్యాచి
లర్" నే అనగా బ్రహ్మచారినే అనుకోండీ. అయితేనామైండ్
యెవ్వరిమీదకు వెళ్లుతుందో వారినే చేరదీస్తాను. వారినేబాగు
చేస్తాను. వారినే మహారాజు భార్యకంటె ఎక్కువగాచేస్తాను.
అనేకచోట్ల అనేకమంది తమంతట తాము వలచి మీదపడ
డానికివస్తే తప్పించుకొన్నాను. నామనస్సు సాధారణంగా చ
లించదు. కాని యీవూరువచ్చినతరువాత ఒకరినిచూచినాను.
హృదయం చలించిపోయినది. అటువంటికాంతనాకు "వైఫు"
గా వుంటే యెల్లావుండునురా. అని అనుకొన్నాను. అయితే
యేమిలాభం నామనస్సునాతో ,,ఓయీ! కేశవరావు నువ్వు
చూచినఫిమేల్ చాలా బ్యూటిఫుల్ గర్లే అయితేఅది యిం
కొకరి ప్రాపర్టీ. అందనిపళ్లకు చేతులుజాపితే యేంలాభం"
అని బోధిస్తూవుంది.

సర—(తనలో) ఈయనచాలాగ్రంథసాంగుడే (ప్రకాశముగా) ఆవిడ
యీవూళ్ళోనే వుందా యేమిటి ?

కేశ—ఈవూళ్ళోనే యిక్కడే ఇంతయేల. నాయెదుట వున్నట్టేవుంది.



సర—ఆవిడ అంత అందమైన మనిషాఅండీ.

కేశ—నాకు అందమైనదే. తానలచినది రంభ తామునిగినది గంగ
అన్నారు.

సర—వారిల్లెక్కడ? ఆవిడ యెల్లావుంటుందేమిటి?

కేశ—ఇక్కడే. చెప్పితే నమ్మతారో లేదోగాని అంతా మీమోస్తరే.
మిమ్మల్నిచూస్తే ఆవిడనుచూడనక్కరలేదు. అంతామీతీరే,
శరీరచ్ఛాయ మీమోస్తరే.

సర—సరిసరి. అంతానామోస్తరేవుండాలి. ఈనిర్భాగ్యురాలిపోలిక
యెవ్వరికీ రావద్దు. మీరువలచిన ఆవిడభర్తకు యేంపని?

కేశ—ఆయనకు 60 యేళ్ళు వుంటాయి. అక్కడా యిక్కడా పురాణ
కాలక్షేపం చేయడం.

సర—(తనలో) ఇదియేమిటి? ఈతడు నన్నుద్దేశించే అన్యాపదేశంగా
పలుకుతున్నాడు. (ప్రకాశముగా) ఏమండోయి మీరింకా
యేమోఅనుకొన్నాను. చాలుచాలు లెండిసరసాలు. మీమా
ట నేనుగ్రహించలేననుకొన్నారా యేమిటి?

కేశ—(తనలో) ఆడవాళ్లు యిల్లాటివ్యాపారాలు వచ్చినప్పుడు ముం
దుకాస్త కోప్పడుతారుగాని తరువాత వాళ్ళే దయతలుస్తారు.
(ప్రకాశముగా) మీరు గ్రహించలేరని నేననుకుంటానా. మీ
రావలిస్తే పేగులు లెక్కపెట్టే సమర్థులు. ఆసమర్థత నామీద
కనుపఱుస్తే యేంలాభంవుంది. నేను మీదయగోరి వచ్చినా
ను. నన్నుకాస్త మీకటాక్షసముద్రంలోముంచాలి. మనరహ
స్యం యొవరికైనా తెలుస్తుందని అనుకొంటారేమో ఏమీ తె
లియదు. సందేహించకండి. (చెయ్యిబట్టుకొనపోవును)

ర—ఏమండోయ్ యీసరసాలు ముదురుతున్నాయే. రమ్మనిబసయిస్తే
వాసాలు లెక్కపెట్టిన సామెతయిందే. మనుష్యుల మంచిచెడ్డ

లెరుగకుండా మాట్లాడుతా రేమిటి! మా జాగావుందే. నడవండి వెళ్ళవండి.

కేశ—రమణీ! నేనబద్ధం ఆడటం లేదు. నిన్ను చూచేటప్పటికల్లా దయ లేకుండా ఆమన్మదుడు డ్యామ్ రెచెడ్ ఫేలో నామీద తన బాణాలు ప్రయోగిస్తూ శరీరమంతా తూట్లుపడేటట్టు చేస్తున్నాడు. నీదయవుండాలి మనమిద్దరం కలసి వాడిని యుద్ధంలో చెమ్డాలు యెక్కతీయాలి. బొత్తిగా భయం లేకుండా వున్నాడు.

నర—మీ వేషం బాగానేవుంది. ఈ సంగతి యెవరన్నా విన్నారంటే మీకు యెంతహాని వస్తుంది. మీరేమో పెద్దమనుష్యులు అనుకొన్నానుగాని యిల్లాటి తుంటరివాళ్ళనుకోలేదు. పరాయిఆడవాళ్ళను యిల్లాఅంటే వూరుకొంటారా! బుద్ధిచెప్పిస్తారుగాని మిమ్మల్ని చూస్తేనాకు చిరాకువేసుకొని వస్తూవుంది. వెళ్ళండి అవతలకు మర్యాదగా లేకపోతే కష్టము.

కేశ—నాకు బుద్ధిమీరే చెప్పాలిగాని మరొకరిచేతమాత్రము చెప్పించకండి. యేమిటో మీదయ ఆసించిఆసించి వచ్చినాను. నీవు నామాశ్యపుదా! విగావు. బాగా చదువుకొన్నావు. కాస్త నామీద దయజూపాలి. నాస్నేహం నీకెంతలాభం వుంటుందనుకొన్నావు, నేను కవీశ్వరుడినికూడాను.

నర—అల్లాటివి యిక్కడసాగవు. అదిచాలాతప్పు. మీదారిని మీరు పొండి. యిందుకామాటకూడా యిక్కడే పెట్టుతానన్నారు.

కేశ—

మ. ఒకమాటించుక యాలకింపుమిపుడో హాయబ్జపత్రాక్షి; తావక కారుణ్యా సుధారసంబిపుడు ద్రావక వచ్చియున్నాడ; వన్నకలంకస్థితి జూచి నెమ్మదిని నుద్వృత్తివితిగాపాడకర్ణ వికట భ్రూకుటి దుర్నిరీక్షితనిటుల్ వీక్షింపగా ధర్మమే.

(దగ్గిరకు చేరబోవును.)



నర—ఇదిగో మీరు దగ్గిరకు రాకండి. నేను కేకలు వేస్తాను.

కేశ—

౧. తరుణీ! దూరపథశ్రమాగతుడ నా తాపంబు జల్లార్పవే కరణిన్ దప్పని పల్కగాదగునె యీ కాముండు కోపంబునన్ శరముల్ జిమ్ముచునుండ నేగతినిఁ బ్రాణంబుండు దేహంబుతో శరణం బెవ్వరివేడుకొందు జపుమా సంపూర్ణ చంద్రాననా.

మ. సకలస్థావర జంగమాత్మక ప్రపంచంబందు పర్వప్రమాలైన కవీశాగ్రణులే నృపాలకులు నానాసౌఖ్యభోగంబులన్ సుఖముల్ గాంతురు వారికేమియును నెచ్చోలేదు వీక్షింప నీకిక దాసుండను నేమిచెప్పుదును విద్యాపరా భారతీ.

ఇదిగో చెప్పుతున్నాను. నాస్నేహం వూరికేపోదు. వెధవడబ్బుకోసం నేను ఆలోచించేవాడిని గాను. అల్లాటిగుణం లేనివాళ్ళను బలవంతపెట్టేవాడిని గాను. కావాలంటే నీచెయ్యిచూచి సమస్తమూ చెప్పుతాను ఇల్లాతే నీచెయ్యి. (ముట్టుకొనబోవును)

నర—నాచేయి ముట్టుకోకండి.

కేశ—పోనీలెండి మొఖంచూసే చెప్తాను. (ఆలోచించి వేళ్ళు లెక్కపెట్టి) మీరు కోప్పడకండేం. నిజంగా చెప్పండి. పదిరోజులక్రిందటయీవూళ్ళో ఒక వెధవఆవిడ మీకున్నా ఒక కోమటికిస్నేహం చేయించలేదూ. ఆకోమటి మీకు రెండు వస్తువులు చేయించలేదూ. అవునా కాదా చెప్పండి.

నర—(తనలో) ఈయన యెవరోగాని దేవుడులాగున్నవాడు. ఈసంగతులుకూడా యీయన యెల్లాచెప్పినాడో. ఈయన నాపరువే తీస్తాడో. కర్మం బాగానేవుంది. అయినా కాస్త తీక్షణంగా కోప్పడి ఛూతాము. (కోపముతో) సరి సరి. ఇదికూడా ఒకటి తెచ్చి పెట్టున్నారు మాకు. మీజ్యోతిష్కము తీసుకొనివెళ్ళి

అగ్నిహోత్రంలో పడవెయ్యండి. (కోపముతో జూచుచు)

కేశ—

మ. ననువీక్షించిన మోముద్రిప్పుటమరిఁ న్నామాటలాలించిన్
కనుబొమ్మల్ ముడివేసి కన్నుల మహోగ్రంబైనదృష్టిన్ నన్
గినుకన్ జూచుచు బంస్లునెక్కుచు మదిన్ ఁ వీక్షింపగానేల; యు
ల్కను వీడంగదె చేతనైనయెడలన్ ఁ గంజాస్త్రి వారింపవే.

నర—(తనలో) ఈతనితో స్నేహంచేస్తేనే బాగావుంటుంది. లేకపోతే నాసంగతి టమటమాయిస్తాడేమో. కానీ, యెల్లాగా ఆవీరమ్మ నన్నీ వ్యాపారంలోకి దింపిందిగదా. నూరునోములూ ఒక అంకుతోసరి యన్నట్లు దుర్వృత్తిలోకి ప్రవేశించిన తరువాత ఒకసైతేనేమి రెండయితేనేం. (ప్రకాశంగా) మీకు నామీద యెంతయనురాగం వుంటుందో కనుక్కోడానికి యిల్లా అన్నానుగాని మరోటికాదు. మీరాగ్రహించవద్దు. ఇంతటినుంచి నేను మీస్నేహితురాలనని భావించండి రండి. ఈపూట భోజనం యిక్కడనే చెయ్యండి.

కేశ—నేను భోంచేసివచ్చానని చెప్పినానే. నేను మళ్ళీవస్తాను. ఈలోపుగా నీభోజనంకూడా అవుతుంది.

నర—తప్పకుండా రావాలిసుమండీ.

కేశ—మరోమోస్తరా (ఇవతలకువచ్చి) మనపాచిక పారింది. కాని నేను యీవూరువాడిని కానని అనుకొంది. నెమ్మదిగా నారహస్యం చెప్తాను. అప్పుడేమి చెయ్యలేదు. ఈఫ్రెండ్ షిప్ లాంగు స్టాండింగుగానే వుంటుంది. నేను యికవెళ్ళి యీవిడ భోంచేసేటప్పటికి వస్తాను. (నిష్క్రమించును.)

నర—(తలుపువేసుకొని నిష్క్రమించును.)



[రంగము:—సింహాచలము క్రొత్తమందిరములో
చంద్రవదన, సింహాచలము ప్రవేశము.]

చంద్ర—అమ్మాయీ! సింహాచలమూ! షావుకార్లుషావుకార్లంటాంగాని వెంకట్రామయ్యగారు వారినందరినీ మించినారు. మేడ కట్టిస్తామని యిట్టేకట్టించారు.

సింహా—అమ్మా! తరువాత చూచినాను. గృహప్రవేశము రోజున బ్రాహ్మణులకు ఆయనయిచ్చిన సంభావన యెంత అయిందనుకొన్నావు. లెక్కవేసి ఆఖర్చుచూచాం. ఆరువందలరూపాయలయినాయి. బుద్ధిపుట్టిందంటే యెంతైనా ఖర్చుచేస్తాడు.

చంద్ర—అవును నీవుకూడా ఆయనయందు బాగాఅనురాగంవున్నట్టు కనిపిస్తూ డబ్బు చేసుకోవాలి. ఆయనదగ్గర డబ్బులాగడానికిదే సమయం. డబ్బంతా అయిపోవస్తుంది అనివిన్నాను. మనకు వీళ్ళంతా శాశ్వితమనుకొన్నావా యేమిటి? యిల్లాటివాళ్ళుమన చేతిలో ఎంతమంది అవుతారో.

సింహా—అవునమ్మా! ఆయన ఆమధ్య చెన్నపట్టణం వెళ్ళినప్పుడు టాకరుఅండ్ సన్సుకంపెనీలోకొన్న వుంగరం నాకిమ్మనిఅడిగినాను. నాల్గురోజులు మోజు తీరినతరువాత యిస్తానన్నారు. అదిచాల ఖరీదు 3500 రూపాయ లయిందంట. ఒంటిరాయి వజ్రపు వుంగరము.

చంద్ర—వీటన్నిటికీ ఏమిగాని వెంకట్రామయ్యగారి పేరువుంటే వాళ్ళవాళ్ళు యేమయినా తగాయిదాపరుస్తారేమో అని యీయిల్లు ప్రస్తుతం సుబ్బయ్యగారిపేర పెట్టించాలి. ఈయన కోమటి ఎత్తుల్లోవాళ్లు. ఈకాస్త ఆయన పెరుమాళ్ళకైంకర్యం చెయ్యకుండా నేను యెల్లాగో ఒకలాగున టోపీవేసి మనపేరుపెట్టించేలాగు నేను చేస్తానులే. (ఇంచుకయూరకుండి) సరేగాని వెంక

ట్రామయ్యగారు యిప్పుడు కలకత్తా యెందుకు వెళ్ళినారో నీతో చెప్పలేదా.

సింహా—నాతో చెప్పలేదు, రేపో యెల్లుండో వస్తారు.

[రామన్న ప్రవేశము]

చంద్రి—ఏం రామన్నా! యీలా వచ్చినావు, ఏదో పనివుంటేనే గాని రావు.

రామ—పనివుండబట్టే వచ్చాను. వెంకట్రామయ్యగారు కలకత్తానుంచి యింకా రాలేదా యేమిటి?

చంద్రి—రాలేదు.

సింహా—రేపో యెల్లుండో వస్తారు, ఏం పనివుంది?

చంద్రి—మేళాల్లోకి వెళ్ళుతున్నావా.

రామ—ఏమి మేళాలమ్మా! గొప్పగొప్ప వారంతా బయలుదేరి భోగం వాళ్ళను మేళాలకి పిలువకూడదంటున్నారు. అదికాకపోయినా మీ మేళం వున్నప్పుడు తిత్తి వూదడానికి వస్తే ఓ పావలా డబ్బులు దొరికేవి. ఇప్పుడు మీరు గొప్పసానులయిపోయి మేళాలు కట్టడం మానివేసినారు, ఏకూలో చేస్కొని బ్రతుకుతున్నాను.

చంద్రి—సుబ్బయ్యగారికిగాని, వెంకట్రామయ్యగారికిగాని మేము మేళాల్లోకి వెళ్ళడం యిష్టంలేదు.

రామ—అవును, మీ యిద్దరికీకూడా మంచి ప్రాపకం దొరికింది, హాయిగా గుఱ్ఱపుబళ్ళు యెక్కి తిరుగుతారు, నౌఖర్లు, చాకర్లు, పోనీ బీదవాడినిగదా అని నావిషయమై కాస్త సుబ్బయ్యగారితో చెప్పి యేకొట్టుదగ్గిర అయినా చిన్న నౌఖరీ అయినా చెప్పించవు. మీ కులంవాడినిగదా, కూటికి పేద అయితే కులానికి పేద కానుగదా.

చంద్రి—ఈమాట నువ్విదివరకెప్పుడయినా చెప్పినావా? ఇప్పుడు చెప్పినావుగనుక గ్యాపకం వుంచుకొంటాను. [illegible]



వచ్చినపని యేమిటి?

రామ—మరేం గొప్పపని యేమీ లేదు. మీ అమ్మాయిని యిప్పుడెవ్వరిదగ్గిరకూ పంపడంలేదు కాబోలు.

చంద్రి—ఇప్పుడా సంగతి యెందుకు?

రామ—ఎందుకయితేనేమిలే. చెప్తే చెప్తాను.

చంద్రి—రామన్నా! వెంకట్రామయ్యగారు దీనికి కావలసినంత సొమ్ము యిస్తున్నారు, ఏమీ కొరతలేకుండా వుంది. ఇల్లా వున్నప్పుడు నాలుగింటికి అయిదింటికి ఆసపడడం, చివరకు వెంకట్రామయ్యగారికి తెలియడం యిదంతా యెందుకువచ్చినగోల అని అల్లాటివి మానివేసినాను. చూచావుగాదూ. నీలాచలానికి యెంత డబ్బు యిచ్చాడు వెంకట్రామయ్యగారు. దానితో సంతృప్తి పొందక, తుంటరివేషాలు వెయ్యడంచేతనే కాదూ వదలిపెట్టేసింది.

రామ—దానిమాట కేమిలే. గుట్టు దాచుకోకపోయింది. అదిగాకుండా మీ అమ్మాయిని 4, 5 కు పంపడం నాయిష్టంకాదు ఎవ్వరన్నా గొప్పజమీందారులవంటివారు వస్తే పూర్తిగా సంతోషపరుస్తారు. అలాటి అప్పుడు ఒప్పుకోకపోతే బాగుండదు.

చంద్రి—నువ్వు చెప్పినమాట నిజమే. ఆమధ్య ఒకరు బరంపురాన్నుంచి వచ్చినారు, నాయుళ్ళట, కబురు పంపించినారట, చాలా గొప్పవారు, ఏమో వెంకట్రామయ్యగారు వూళ్ళోలేరుగదా అని ఒప్పుకొన్నాము. ఒప్పుకొన్నందుకు ఆయనకూడా అమ్మాయికి 100 రూపాయలు యిచ్చి వెళ్ళినాడు. అలాటి పద్దేదన్నా కనపడితేనే తప్ప చిల్లరవిషయం మామనస్సులోకి తెచ్చుకోవడంలేదు. ఎందుకు వట్టి గుల్ల చేసుకోవడం.

రామ—నిన్ననే యీవూళ్ళోకి హైదరాబాదునుంచి ఒక జాగీరుదారు

వచ్చినాడు. మహాషోకేలాపురుషుడు. శ్యామసుందరరావుగారు ఆయనపేరు. సాలుకు 10 లక్షలరూపాయలు వస్తవట. మా యింటిప్రక్కనే ఒకమేడ తీసుకొన్నాడు. ఏదో వ్యాపారంమీదవచ్చినాడట. ఎల్లావిన్నాడో మీఅమ్మాయిసంగతివిన్నాడు. ప్రక్కనే వుండడంచేత నన్నుపిలిచి కనుక్కోమన్నాడు. అందుచేతనే వచ్చినాను ఆలోచించండి. ఆయన మళ్ళీ రెండుమూడు రోజులలో వెళ్ళిపోతాడు.

చంద్ర—యేమో ఆయన యెల్లాటివాడో.

రామ—ఆసందేహం యేమీఅక్కరలేదు, 500 రూపాయిలకు తక్కువ పద్దుపడదు, అందుకునాదీపూచి, నీవునన్నుకూడా కనిపెట్టాలి.

చంద్ర—ఇంతకీ అమ్మాయి వప్పుకోవాలికదా. (సింహాచలాన్నిచూచి) అమ్మాయీ!, విన్నవా, నీకిష్టమేనా.

సింహా—ఒకవేళ వెంకట్రామయ్యగారు యీరాత్రి వస్తారేమో.

చంద్ర—వస్తేనేంలే. యింతమేడలో యేబారినైనా పంపకపోతాము. ఎంతపెద్దమనుష్యులయినా, డబ్బు గుమ్మంలో అడుగుపెట్టగానే వసూలుచేస్తాముకదా, తరువాతసంగతి చూచుకొనవచ్చు, నీకిష్టమయితేచెప్పు. రామన్నవున్నాడు అన్నిటికీ.

సింహా—కానీ నీయిష్టం. అయినా వెంకట్రామయ్యగారుయీవేళ యెక్కడవస్తారులే. వచ్చేటట్టయితే గుఱ్ఱపుబండి స్టేషనుదగ్గిరకు పంపమని టెల్లిగ్రాము యిస్తారుగదా.

చంద్ర—అవును. (రామన్ననుచూచి) రామన్నా! ఈరహస్యంమాత్రంనీవు యెక్కడా బయలుపెట్టకూడదుసుమా, అమ్మాయి తినే తినేకూడు పడిపోతుంది. వెధవడబ్బాశచేత యిల్లాంటికక్కుర్తిపడవలసి వస్తూవుంటుంది. ఎంతడబ్బు వస్తూవున్నా తృప్తి యుండదుకదా.



రామ—దానికేమమ్మా మహామహావాళ్ళేచేశారు. సరేనేనుఆయన్ని పెందాళ్ళే తీసుకొనివస్తాను. ఇంకనేవెళ్లుతాను.

చంద్ర—అమ్మాయీ! ఆయనయెవ్వరో గొప్పజాగీరుదారులట. నీవు సందెపాటునేచక్కగా నీళ్ళుపోసుకొని అన్నివస్తూలుపెట్టుకొని సుబ్బయ్యగారు కాశీనుండితెచ్చిన జరీపట్టుచీరకట్టుకొని బనారసు రవికెతొడుక్కో. తెలిసిందా. పోనీ ఒకఅయిదువందల రూపాయిలు వస్తాయి. అందులో వెంకట్రామయ్యగారువూళ్లో లేరుగదా. ఇందులో మనకు మించిపోయింది యేముంది?

సింహా—ఈసంగతి నువ్వునాకు చెప్పాలాయేమిటి? దాసీఅసిరినిషాపులోకిపంపి లవండరుసోపు పెట్టెఒకటి తెప్పించు. సబ్బుబిళ్ళ అయిపోయింది.

చంద్ర—అల్లాగే. ఇప్పుడే తెప్పించుతాను రా. (నిష్క్రమింతురు.)

——

[రంగము:—సింహాచలము మందిరములో ప్రవేశము
రామన్న, శ్యామసుందరరావు]

శ్యామ—రామన్నా! ఆహా! ఏమిమేడోయి యిది. ఇది చంద్రవదనకీ సింహాచలానికీన్నీ యెవ్వరు కట్టించారోయి. భోగందానికిట్టిమేడ కట్టించినవాళ్ళను యెక్కడా చూడలేదు.

రామ—బాబూ ఇది కట్టించడానికి సొమ్ము యిచ్చింది ఒకబ్రాహ్మణాఘున. పేరు షావుకారిది. సింహాచలాన్ని వెంకట్రామయ్యగారను ఒక బ్రాహ్మణుడుంచుకొన్నాడు. ఆయన దీనికంతకు కారకుడు.

శ్యామ—చాలా గొప్పవాడుకామోసు.

రామ—ఓ లక్షరూపాయల ఆస్తిపరుడు. అంతా అయిపోవచ్చింది ఒక్కొక్కబాకీకే కర్ప్లయింటులు దాఖలు అవుతూవున్నవి.

శ్యామ—ఏదీ! ఆసింహాచలం యింకా యివతలకురాదేమి? పాపము నీభోజనమయింకా అవలేదుకామోసు.

రామ—భోంచేస్తాను. తమ పాదసేవకంటె నాకు అన్నంతినడం యెక్కువా. తమపనిసప్లయిచేసి వెళ్ళుతాను. ఇంకా లోపలఆలస్యం యేమిటో కనుక్కొనివస్తాను. (నిష్క్రమించును.)

శ్యామ—(తనలో) ఈవూరువచ్చి జమీందారువని పేరుపెట్టుకొని నెల్లాళ్ళుబట్టి వుంటూ గ్రామంయొక్క ఆచోకి తీశానుగదా. ఈ చంద్రవదన కూతురికి వంటిమీద ఇరువైవేలరూపాయల నగలున్నాయని విన్నాను. అవిఅన్నీ యీరాత్రి పెట్టుకొందాదానికొంప గుల్చినవాడనే. లేకపోతే నేను దీనికిప్పుడిచ్చేవెయ్యిరూపాయలైనా తీసుకొనలేకపోతానూ. వస్తువులు కత్తిరించేసామాను తెచ్చినానుగదా. పైగా యీసింహాచలం కాస్త డోసుకూడా వేస్తుందని విని యక్షాననంబరు వక బుడ్డి పట్టుకొని వచ్చినాను. నెమ్మదిగా దానితో చల్లనికబురులు చెప్పుతూ రెండు డ్రాములు తాగేటట్టు చేస్తినా కైపెక్కి నిద్రపోతుంది. ఆసమయంలో దీనివస్తువులు అన్నీ తస్కరించేది. నెమ్మదిగా తలుపుతీసుకొని వుడాయించేది. కాని, భగవంతుడున్నాడు. అదుగో రామన్న వస్తున్నాడు.

రామన్న—(ప్రవేశించి) బాబూ! వస్తావుంది. చీరకట్టుకోవడం ఆలస్యమైనది.

[సింహాచలం ప్రవేశము.]

సింహా—(శ్యామసుందరరావును చూచి) కుంతులుగ్గారూ! నమస్కారములు.

శ్యామ—దా. ఇల్లాకూర్చో.



సింహా—ఫరవాలేదు. కూర్చుంటానులెండి. తమవంటి జాగీరుదారులు వచ్చినప్పుడు తగినట్టు మర్యాదలు చేయడానికి బొత్తిగా బీదవాళ్లమై యున్నందుకు చాలా విచారంగావుంది. ఏమిటో మట్టికొంపలు, నులకమంచాలు.

శ్యామ—ఓహో! గొప్పవాళ్లు గొప్పవాళ్లమని చెప్పుకోరుగదా! మాహైదరాబాదులో యిటువంటి మేడగలవేశ్య ఒకటీలేదు.

సింహా—ఆవూళ్లో మేడలకేమితక్కువ. తమది పెద్దమేడ అని తోస్తుంది.

శ్యామ—అదోమోస్తరు యిదోమోస్తరు. మాయింటికాడనుంచిమా ఆఫీసువరకుచూశావు బెజవాడలో బందరురైలు యెక్కేస్థలానికి, చెన్నపట్టణం రైలుయెక్కే స్థలానికిమధ్య రయిల్వేనంతెనవుందే ఆమోస్తరుగా మాయింటివద్దనుంచి పైగా ఆఫీసువరకు వంతెనవుంది. అదినేనేకట్టించాను. మూడులక్షలరూపాయలయింది. ఒకసారి హైదరాబాదు రారాదూ! అన్నీ చూడవచ్చును.

సింహా—తమదయ వుండాలిగాని రావడానికేమి. ఇప్పుడల్లా అంటారుగాని తీరావస్తే అప్పుడు మీరు మమ్మల్ని చూస్తారా!

శ్యామ—ఎంతమాట అన్నావు. మర్చిపోతామనుకొన్నావా యేమిటి?

సింహా—తమసంగతి అంతా యీరామన్న చెప్పినాడు. మీరు మాయింటికిరావడం గంగానది చాటినేలమీద బాటినట్లున్నది.

శ్యామ—నన్నేకాదు నవాబులంతటి వారినిగూడా నీసౌందర్యము ఆకర్షిస్తుంది.

సింహా—ఏమిటో మీకు నాయందు పూర్వాదయ వుండడంచేత నేను చాలా అందకత్తెనని చెప్పుతున్నారు. మీహైదరాబాదులో ఖాతాతెలంతటివాళ్లున్నారు.

శ్యామ—వెధవది మోటదేశం. యెడ్డెమనుష్యులు. నీకాలిగోరుకైనా అక్కడివేశ్యలు చాలరు. (మెడకేసిచూచి) ఈవస్తువులు అన్నీ నిన్నిప్పుడుంచుకొన్న వెంకటాద్రియ్యగారు చేయించినవేనా?

సింహా—చాలాభాగం వారు చేయించినవే. కొన్ని మాఅమ్మను వుంచుకొన్న సుబ్బయ్యగారు చేయించినారు.

శ్యామ—అన్నీ యిరవై వేల రూపాయలు వుంటాయి.

సింహా—వుంటాయండి

శ్యామ—నువ్వు మావూరువస్తేనా. నెత్తిమీద పెట్టుకోనా.

సింహా—ఎప్పుడన్నా రావాలండీ. మీరు వెళ్ళేటప్పుడు మీఅడ్రెస్సు అది యిచ్చి వెళ్లండి.

రామ—బాబూ! పంతులుగారూ! ఇంక నేను వెళ్ళనా.

సింహా—ఇంకా భోంచెయ్య లేదా యేమిటి?

రామ—లేదమ్మాయి.

సింహా—పోని! ఇక్కడన్నా భోంచెయ్య లేకపోయావా! ఇంతలో మూక్కు పోయేది యేమిటి?

రామ—పరవాలేదు. మీఅమ్మవస్తుందేమో చెప్పి వెళ్ళుదామని వూరుకొన్నాను.

[లోపల రామన్నా, రామన్నా.]

రామ—వస్తున్నాను.

శ్యామ—ఎవరది?

సింహా—మాఅమ్మలెండి.

రామ—ఎందుకో పిలుస్తూవుంది వెళ్లివస్తాను. (నిష్క్రమించి వెంటనే ప్రవేశించి) బాబూ. పంతులుగారూ! యిల్లా ఒక్కసారిదయ చేయండి.)

శ్యామ—(రామన్నను సమీపించును.)



రామ—(రహస్యంగా) ఎంతడబ్బువున్నా మాభోగంవాళ్ళువాళ్ళజాతి లక్షణం వదలరు. ఇది తమకుమాత్రము తెలియదాయేమి. ఇప్పుడే మిమ్మల్ని అడగడం నాకుచాలాసిగ్గుగావుంది. పోనిలెండి. ఎప్పుడయితేనేం యివ్వడానికి దీనితల్లి కాస్త పిటికిదిలెండి. వెనుక ఒకమొఖాసాదారువచ్చి మొదటరాత్రికి వెయ్యిరూపాయలిస్తానని చెప్పి తుదకు 800 రూ. చేతిలోపెట్టినాడు. అప్పటి నుంచీ దీనికి యెవరేమిచేస్తారో అని భయంపుట్టింది. అందుకనే డబ్బు యియ్యమని అడిగింది. ఆయన అల్లాటివారు కాదు సంగతి తెలియకుండా మాటాడుతావని నాలుగువాట్లు వేసినాను గాని యెందుకు దానిమనస్సు చిన్నబుచ్చాలి. తమరియ్యదలచుకొన్నది యేమిటో యిచ్చేస్తే బాగుంటుంది.

శ్యామ—ఏమిస్తే బాగుంటుంది నీవే చెప్పు.

రామ—ప్రభువులు మీకు నేను చెప్పాలా. ఇదేమీకు క్రొత్తా! ఇల్లాటిసానులను యెంతమందిని మీరు చూచారో కాని సాధారణంగా యీసింహాచలం యెవరిదగ్గిరకు వచ్చేమనిషికాదు మహాకష్టంమీద వప్పించాను. తరువాత తమచిత్తము. ఆసొమ్ముమీరేయియ్యండి. నేనే యివ్వనక్కరలేదు.

శ్యామ—సరే. ఇవిగో ఇవి వెయ్యిరూపాయల నోట్లు. రెండు కట్టలు రెండు అయిదువందలవి. ఇచ్చివేసిరా. ఎవరైతేనేం.

(ఇచ్చుచున్నాడు.)

రామ—(పుచ్చుకొనితనలో) ఇందులో ఒకకట్ట నాజేబులోవేసుకొని తక్కినవి చంద్రవదనకిస్తే యెవ్వరెరుగుతారు. నాదారిని నేను చక్కాపోతాను. తరువాత ఈయన యెవరో నేను యెవరో. (నిష్క్రమించి వెంటనే ప్రవేశించి) అమ్మాయీ! సింహాచలమూ! అంతా ముట్టింది. వీరు చాలాగొప్పవారు. ఎల్లాగను

చుకొంటావో నేను వెళ్ళివస్తాను. (శ్యామసుందరరావునుజూచి) బాబూ భోజనానికి పొద్దుబోయింది. నేను శెలవుతీసుకొంటాను. ఉదయం బసలో దర్శనంచేస్తాను. (నిష్క్రమించును.)

సింహా—పంతులుగారూ! ఇప్పుడే మాఅమ్మతో ఒకమాట చెప్పివస్తాను కూర్చోండి. (నిష్క్రమించును.)

శ్యామ—(తనలో) నెమ్మదిగా దీనికి డోసువేయించి మెళ్ళోవన్నీ తువరంచెయ్యాలి. వెనక యేలూరులోకూడా ఒక భోగందానికి రెండువందల రూపాయలిచ్చి ఆరాత్రివెళ్ళ అయిదువేలరూపాయలనగలు కైంకర్యంచేసినాను. ఏముందీ తెల్లవారేటప్పటికి మళ్ళీవేషం మార్చేస్తాను. ఇప్పుడున్న బసకు వెళ్ళకుండా యేసాయిబువేషమో సన్యాసివేషమో వేసుకోవచ్చును. నాపత్తా యెవ్వరికీ చిక్కదు.

సింహా—(ప్రవేశించి) పంతులుగారూ! ఆలస్యమైంది క్షమించాలి.

శ్యామ—పరవాలేదు ఇంతమాత్రానికే. సరేకాని యిల్లాకూర్చో.

సింహా—(కూర్చుండును)

శ్యామ—నీకళ్ళు కొద్దిగా యెఱ్ఱగావున్నాయి యెందుచేత? అడిగినానని కోప్పడకుము. కొద్దిగా యేమయినా—

సింహా—అదేమిటండోయి! కొద్దిగా యేమయినా అంటున్నారు.

శ్యామ—మరేంలేదు. విస్కీగాని, బిస్కటుగాని యేమయినా అలవాటు కాస్త వుందేమోఅని.

సింహా—(తనలో) నేను తాగిందే విస్కీ ఒక్కడ్రాము. దిక్కుమాలిన వాసన ఆగదుకదా. ఈయన ఆనవాలుపట్టినాడు. సైద్ధమనిషి దగ్గిరకూడా బయలు పడ్డది.

శ్యామ—నీవు సందేహించకు. నాకూ అలవాటువున్నదిలే. ఏమయినా హాజరులోవుందా.



సింహా—లేకపోతే నౌఖరునుపంపించిషాపునుంచి రెండునిమిషములకు తెప్పించుతాను.

శ్యామ—అక్కరలేదు నాదగ్గిర వున్నదిలే. నాకుఅప్పుడప్పుడుపుచ్చుకోవడం అలవాటుంది. ఇల్లాటిసమయంలో పొరుగూళ్ళువచ్చినప్పుడు నీళ్ళుపడక యేంజబ్బు చేస్తుందోఅని కాస్తపుచ్చుకొంటాను. నీదగ్గిర వైన్‌గ్లాసు యిల్లా పట్టుకురా.

సింహా—(వైనుగ్లాసు పట్టుకొనివచ్చి యిచ్చును.)

శ్యామ—(తనలో) నేనుకొద్దిగాపుచ్చుకొని తాగుతూవున్నట్టుఅటువేపు తిరిగి పారపొయ్యాలి. నేనుగూడా పూర్తిగావేస్తే నాకార్యమునకు భంగమౌతుంది. దీనిని పూరాగా తాగించాలి. (ప్రకాశముగా) ఇది వెండిదిలావుందే! వైనుగ్లాసుకూడా వెండిది చేయించావా! చాలాబాగుంది. (బ్రాందీ గ్లాసులోపోసి) నువ్వుకూడా కాస్తపుచ్చుకోమరి. భారమంతా నేనువేసుకోగలనా?

సింహా—నేనిప్పుడే కొద్దిగా పుచ్చుకొన్నాను. నాకంతచేటుఅలవాటు లేదు. మీరు కానియ్యండి. ఎక్కువగా పుచ్చుకొంటె వెళ్ళిపోతుందేమొ.

శ్యామ—పరవాలేదు. ఇది వెళ్ళిపోయేది కాదు. నిషాచేసేది కాదు. పరవాలేదు పుచ్చుకో (అని యిచ్చును)

సింహా—(త్రాగి) ఇదోమోస్తరు గులాబివాసన. ఇల్లాటిది మునుపెప్పుడూ నేను చూడలేదు.

శ్యామ—ఇది బుడ్డి 15 రూపాయలు ఖరీదు. ఖరీదునుబట్టి వస్తువుయొక్క మంచిచెడ్డలు వుంటాయి. నేనుకూడా కాస్త పుచ్చుకొంటాను. (కొద్దిగా పుచ్చుకొనును)

సింహా—పంతులుగారూ! మీరు యిప్పుడు రామన్నకు మాఅమ్మకు యెన్నిరూపాయలు యిమ్మని యిచ్చినారు

శ్యామ—ఏమి అల్లాఅడుగుచున్నావు?

సింహా—ఏంలేదు వూరికేనే.

శ్యామ—నేను వెయ్యిరూపాయిలు ఇచ్చినాను అంతా ఇయ్యలేదా యేమిటి?

సింహా—నిజమేనా. అంతసొమ్ము మీరు యిప్పుడుయిచ్చినారా!

శ్యామ—నేను అబద్ధంఆడుతానా. వాడేదో టోపీవేశాడు కాబోలు.

సింహా—ఏమయితే నేమిలెండి. సగం మాకు ముట్టింది.

శ్యామ—నేను మొదట నీకేయిద్దామనుకుంటే మీఅమ్మ యిప్పుడే యిమ్మంటే యిచ్చినాను. దానికి నేనేమిచెయ్యను, నావల్ల యేమీ లోపము లేదు.

సింహా—మీవల్ల యేమీ లోపములేదు; ఇప్పుడేమనుకొన్నా యేమి లాభముంది. రండి పొద్దుపోయింది పడుకుందాం.

శ్యామ—ఇంకొక్కడ్రాము వేసుకుందాం గ్లాసు ఇల్లాపట్టుకొనిరా.

సింహా—అబ్బా! మీరు పుచ్చుకోండి. నేనుపుచ్చుకోలేను.

శ్యామ—పర్వాలేదు ఇంద.

సింహా—(పుచ్చుకొనుచున్నది.)

శ్యామ—(పుచ్చుకొన్నట్లు నటించును)

సింహా—ఏమండీ ఇది నిషా చెయ్యదన్నారు. భూమిఅంతా తిరిగిపోతూవుంది మహాజోరుగావుందే, నాకుప్రపంచకమేకనబడత్తం లేదు.

శ్యామ—(తనలో) ఇది నెమ్మదిగానిద్రవువళ్ళు తెలియకుండాపడ్డదంటే నాకార్యంనేనుచేసుకొనిపోతాను. ఆహా ! దీనివంటిమీదయేం నగలు, ఇవిచూస్తే నాకళ్ళు కుట్టుతున్నాయి, త్వరగా కత్తిరించి తీసుకొనిపొమ్మని కత్తిరలు తొందరపడుతున్నాయి. (ప్రకాశముగా) పద పడుకుందాము.

(నిష్క్రమింతురు.)



[శ్యామసుందరరావు ప్రవేశము.]

శ్యామ—(తనలో) ఆహా! తానొకటితలుస్తే దైవమింకొకటి తలుస్తాడట, ఆసామ్యం నిజమైంది. ఈముండడోసు బిగువుమీద మైమఱచి నిద్రపోతూవుందిగదా అనితలంచి నెమ్మదిగావస్తువుల్ను స్వీకరించడానికి కత్తెరలుకత్తివగైరాలు లోపలిజేబులోనుంచి తీసేసమయంలో దీనితల్లికి తేలుకుట్టింది. దానితో అది గోల యెత్తేటప్పటికి దాసీదివచ్చి దీన్ని లేపటం మొదలుపెట్టేటప్పటికి నిద్రదెలిసి లేచింది. అక్కటా! ఏదోకొండంత ఆసపెట్టుకొని ముందు సంచిరూపాయలు వదిలినాను, ఇదివరకుయెక్కడకు వెళ్ళినా నాపాచిక పాఱుతూనేవుంది కాని యీవేళ యిల్లాఅయినది. ఇంతమాత్రంచేత ధైర్యం వదలివేయకూడదు. ఈవూళ్ళోయింకా డబ్బువున్న నీలాచలం అని ఒకర్తెవుందట. దానియింటికి సాహేబువేషముతో సరసానికివెళ్ళి యిక్కడపోగొట్టుకొన్న వెయ్యిరూపాయిలు కూడబెట్టుకోవాలి. ఈరాయభారం రామన్నచేతకాకుండా మరొకరిచేత పంపేప్రయత్నం చెయ్యాలి. ఈవెయ్యిరూపాయలు వచ్చేదాకా నిద్రపట్టదు.

(నిష్క్రమించును.)

---

రంగము:—[మందిరములో వెంకట్రామయ్య సింహాచలము.]

సింహా—ఏమండీ! పంతులుగారూ! ఇదిగోవస్తానని అల్లాగేవెళ్ళి రెండు నెలలు చేశారేమండీ. మీరు ఒంటరిగా కలకత్తాకువెళ్ళితే యేదో కాస్త చిన్నకురుపువేస్తే అక్కడయెవ్వరూ లేకుండా ఆపరేషన్ చేయిస్తే మీపని యెలావుంటుంది, మాకెంతభయంగా వుంటుంది. ఏదోకురుపువేసింది ఆపరేషన్ చేయించేనని వారి

యడమేగాని దానితప్పీలు యేమయినా వ్రాసినారా, అవును
లెండి. నామీద ఆపేక్ష యెందుకువుంటుంది, మేముమీయిష్టే
నుం కోరినవాళ్ళము గనుకనా.

వెంక—(తనలో) అన్నా వేశ్యలంటే సామాన్యులుకారు. వీళ్ళకు ఎం
తడబ్బుయిచ్చినా తృప్తియుండదు. నేను వూళ్లోలేనప్పుడిది యె
వరో హైదరాబాదునుంచివస్తే ఆయనను రప్పించినదట. ఫిడే
లువాయించే శ్రీనివాసులుకి దీనికి యిలాకావుందట. నేనిది క
ర్ణాకర్ణికగా వినడమేగాని కళ్ళతో చూడలేదు. కాబట్టి యిప్పు
డు దీనిని మందలించితే లాభంలేదు. అయినా ఒకతమాషాగా
ఆసంగతి యెత్తుతాను.

సింహా—ఏమిటో ఆలోచించుచున్నారు?

వెంక—ఏమీలేదుగాని, ఆకలకత్తాచూచినమీదట యీవూరు మళ్ళీ
చూస్తే నాకంతా అదియొకమోస్తరుగావుంది. పూరాగాడబ్బు
వున్నవాడు కలకత్తాలో వుండాలి ఆవీధులేమిటి, ఆమేడలేమిటి
మేడలోపలికి వెళ్ళినామంటే మళ్ళీయివతలకు రావడానికి దారి
తెలియక కొట్టుకొంటాము.

సింహా—ఎక్కడకువెళ్ళినా మీరే ఒంగరిగా వెళ్లుతారుగాని నన్నెక్క
డికీ తీసుకొనివెళ్ళరు. ఖర్చుయిపోతుందని బెంగ.

వెంక—పాపము, ఖర్చుయిపోతుందని బెంగవుంటే 40 వేలుయిచ్చిమే
డయెల్లాకట్టించుతాను, 20 వేల రూపాయలుయిచ్చి వస్తువులు
యెల్లా తెప్పించిపెట్టుతాను. ఇవన్నీ యియ్యాగాలేంది ఇక కల
కత్తా తీసికొనివెళ్ళితే ఖర్చుఅవుతుందీ. ఆలోచించకుండా ఏదో
మాట-అనేశయ్యడమే.

సింహా—మాటవరసకన్నానుగాని మీకుయింతకోపమేమండీ. కోప



ము మీకు ముక్కుమీద అడ్డబాస మోస్తరుగా వ్రేలాడు
తూవుంటుంది.

వెంక—నాకు కోపము యెప్పుడూలేదు.

సింహా—పోనియ్యండి. ఇప్పుడా అనవసరమైనసంగతియెందుకు? నన్నే
దైనావూరు షోగ్గాతీసుకొనివెళ్ళండి. దగ్గిరేకదా. పోనీ ఒకసా
రి హైదరాబాద్ తీసుకొనివెళ్లుతారా.

వెంక—(తనలో) ఈహైదరాబాదువ్యాపారం యెత్తుకొని నిమ్మళంగా
రంగులోకి దింపాలి. (ప్రకాశముగా) ఏంహైదరాబాదుమీద
మనస్సుపోయింది.

సింహా—ఏంలేదండీ. అక్కడవూరు చాలాబాగావుంటుందట. గొప్ప
గొప్పమేడలున్నాయట. నవాబున్నాడు.

వెంక—అన్నీవున్నాయిగాని మడ్డిదేశంనాగరికతయన్నమాటపూజ్యం.

సింహా—ఇక్కడవాళ్ళను అల్లాఅనుకుంటాముగాని వాళ్ళుఖర్చుపెట్టి
నంత భారీగా మనవేపువాళ్లు ఖర్చేపెట్టలేరు.

వెంక—అవును. అక్కడవాళ్లు అంటే గొప్పగొప్పమిరాసీదారులు,
యీనాందారులు, జాగీరుదారులు మొదలయినవాళ్ళు యీ
వూళ్ళవచ్చి సానిదానింటికి సరసానికి వెళ్ళినారంటే రూ 500
లకన్న తక్కువయియ్యరట.

సింహా—(తనలో) ఇదేమిటిచెప్మా. ఈసంగతి యెత్తుచున్నాడు. నా
రహస్యం యేమీ తెలియలేదుకదా. తెలిస్తే వానోట్లోమన్నే.
(ప్రకాశముగా) అదంతావుట్టిమాట. ఒక్కరాత్రికి 500 రూ
పాయలు యెవ్వరుయిస్తారు. కాస్తవుంటే గంపంత చెయ్యడం
మనవాళ్ళకు సహజమే.

వెం—నాకూ బాగా తెలియదుకాని, యీవూళ్ళోనే ఒకభోగందానికి

మెవడో జాగీరుదారు 500 రూపాయలు యిచ్చినాడట. నిజ
మో అబద్ధమో.

సింహా—(తనలో) ఈయన నావిషయమై సంపూర్తిగా తెలిసివుంటే
యిలాతమాషాగా అడుగుతున్నట్లు తోస్తూవుంది. కాని భగ
వంతుడున్నాడు. అంతగా తెలిస్తే యేంచేస్తాడేమిటి. (ప్రకాశ
ముగా) ఇల్లాటిపరీక్షలన్నీ నాకేం తెలుస్తాయి. అస్తమానంఅదే
వృత్తిమీద మీరువుంటారు గనుక మీకు తెలుస్తాయి.

వెంక—(తనలో) నిజంగా జాగీరుదారు దీనియింటికి వచ్చియుంటాడా.
ఇదివప్పుకొందా. నేనుయింతధనంయిస్తూ, యిన్నినగలుచేయిం
చిపెట్టూ, యింతమేడ కట్టించియిచ్చినానే, అల్లాటప్పుడు నన్ను
స్వామిద్రోహంచేస్తుందా. దీనితల్లి చాలా పెద్దమనిషి ఒకవేళ
కుఱ్ఱతనపుచేష్టలచేత యిదిచెయ్యబోయినా అదిఆటంకంపెట్టుం
ది. కాబట్టి యీవ్యవహారం నేనునమ్మను. మాస్నేహంచూడ
లేక యిల్లాటితప్పు పెట్టామని యెవ్వరోవేసిన పుకారుగాని మ
రోటికాదు. ఏభోగంముండో ఆనీలాచలమో యెవ్వరో వాడు
పుట్టించి వుంటారు. అంతేకాని ఇదియేమిటి అయిదువందలుకా
దు ఆరువందలుయిచ్చినా మరొకరిని చేరనిస్తుందా. నేనునమ్మ
ను. నమ్మను.

[వాకిట్లో:—ఏమండోయి వెంకటాద్రిమయ్యపంతులుగారు.
వెంకటాద్రిమయ్యపంతులుగారు.]

వెంక—ఎవరువారు.

[వాకిట్లో—నేనుగణపతిలాల్ని]

వెంక—కుఱ్ఱాడా తలుపుతీయరా.

[గణపతిలాలు ప్రవేశము.]

సింహా—(లోపలికిపోవును)



గణ—(వెంకటాద్రిమయ్యనుచూచి) ఏమండీ! ఎప్పుడువచ్చినా మీదర్శ
నంకాదు. మాకుయెన్నిసార్లురావాలమీదగ్గిరకు. రెండుమూ
డుసార్లువస్తే ఇదిగో అదిగో అన్నారు. ఇంతవరకు దస్తావేజు
మీద వసూలుకొంచెమైనా పడలేదు. ఏసంవత్సరంవడ్డీ ఆసం
వత్సరం యిస్తానన్నారు. అదిలేదు. దస్తావేజుమైము దాటవ
స్తూవుంది. మీరు వారంరోజులలో ఫయిసలుచేయకపోతే కో
ర్టుకువెళ్ళవలసివస్తుంది. తరువాత మీచిత్తం.

వెంక—సేట్‌గారూ. ఏదోవుల్లోకలేకపోవడంచేతనున్నూ, కొన్ని కొ
న్ని తొందరపనులు వుండడంచేతనున్నూ ఆలస్యమైంది. లేక
పోతే యీపాటికి యిచ్చివెయ్యవలసిన బాకీయేనండీ. ఇంకతొం
దరపడకండి. ఒక్కవారం రోజులాగండి. ఫయిసలుచేస్తాను. ఇ
ప్పటికేమాత్రం అయిందేమిటి వడ్డీతో.

గణ—53 వేలు.

వెంక—(తనలో) అబ్బా చాలాఅయింది. ఇదితీర్మానం అయ్యేవిధం
యేలాగో అన్నిపొలములుకూడా తాకట్టులోవున్నాయి. అప్పు
లునెత్తినెక్కితంతున్నాయి. మార్గంయేమీకనపడదు. అప్పుకి
ఆస్తికి సరిపడేటట్టున్నాలేదు. కాని భగవంతుడున్నాడు.

[వాకిట్లో—ఏంమండోయి—వెంకటాద్రిమయ్యగారూ
నేనుకోర్టుజవాన్ను.]

వెం—ఏమిటోయి అదియిల్లాతీసుకొనిరా.

కోర్టు-జ—ప్రతివాదిసమను.

వెంక—ఎవరిది అది ?

కోర్టు-జ—వంకాయలపాటి వీరయ్యగారు తెచ్చినవ్యాజ్యం.

వెంక—మొత్తం యెంతయేమిటి ?

కోర్టు-జ—ఎంతండీ. 17000 వేల పైచిల్లర.

వెంక—సరేలే. ప్రస్తుతం వూళ్ళోలేరనితిప్పెయ్యి. నీకు తెలియనిదేమున్నది. వాయిదా గడువుచాలదా. మళ్ళీవాయిదావేస్తారు. ఈ లోపుగా ప్లీడరును కనుక్కొంటాను.

కోర్టు-జ—తమసెలవైతే అల్లాగేచేస్తాను. తమకోసంచాలాకష్టపడ్డాను.

వెంక—సరే. ఈరూపాయిపుచ్చుకో. (రూపాయి ఇచ్చును.)

కోర్టు-జ—బొత్తిగా చిన్నచూపుచూచినారు.

వెంక—పరవాలేదు. నువ్వెక్కడికి వెళ్ళుతావు. నేనెక్కడికివెళ్లుతాను

కోర్టు-జ—తమదయవుంటేచాలు. (నిష్క్రమించును)

వెంక—నెమ్మదిగా అన్నికోర్టులో దాఖలుఅవుతున్నాయి. మనపని తీసికట్టులోకి వస్తూవుంది.

(వాకట్లో—ఏమండోయి—వెంకట్రామయ్యగారూ)

వెంక—ఎవరోయిబాబూ.

[వాకట్లో, నేనుసబుకోర్టు ప్రోసెస్సుసర్వర్ని.]

సబు-ప్రో—(ప్రవేశించి) ఏమండీ పంతులుగారూ మీకోసం పదిరోజులనుంచి తెగతిరుగుతున్నాను. మీకు అరెస్టువారంటువుంది. తమరు కోర్టుకురావాలి.

వెంక—దిక్కుమాలినఅవస్థ యేమిటిది. షూర్యాడీరామనాథు పెట్టించాడా యేమిటి?

సబు-ప్రో—అవునండి.

వెంక—సరేలే. దీనివిషయమై నేనుఅతనితో వేరేమాట్లాడుతాను. కలకత్తావెళ్ళినారని వ్రాసెయ్యి. ఇదిగో యీయైదురూపాయలు పుచ్చుకో.

సబు-ప్రో—చిత్తము. (పుచ్చుకొని వెళ్ళును.)



[సింహాచలం ప్రవేశించును.]

సింహా—ఏమిటండీ. పంతులుగారూ చాలామంది వచ్చివెళ్ళినారు. వీరంతాయెవరు?

వెంక—ఏముంది బాకీలవాడావిడి. మరేంలేదు.

సింహా—మీరు ముందువెనుక చూడకుండా తెగఖర్చుపెట్టేస్తారు. ప్రతిచోట అప్పులుతెస్తారు. చూడండి యిప్పుడు వాళ్లువచ్చి గొంతుక్కూయమీద కూచున్నారు. ఎంతకష్టమో.

వెంక—కూర్చుంటే యేమిచేస్తారులే. బాకీలు యియ్యలేకపోతే ఇన్‌సాల్వెన్సీఒకటివుందికదా. ఇప్పుడుచాలాడబ్బువున్న షావుకార్లే వూరునిండా అప్పులుచేసిఆస్తి అంతా పెళ్ళాముపేరపెట్టేసి కోర్టుకువెళ్లి దివాలాపిటీషను దాఖలుచేస్తున్నారు. కాబట్టి మన బాకీలవిషయమై నీవుయేమీభయము అందవలసినపనిలేదు.

సింహా—దివాలాపిటీషను దాఖలుచేస్తే పరువువుంటుందా. పరపతిపుట్టుతుందా. ఇది యిల్లావుండగా అవతలవాడు ఖైదులోపెట్టిస్తే మర్యాదపోదా?

వెంక—సివిలుఖైదుకున్నూ, క్రిమినల్‌ఖైదుకున్నూ చాలాభేదంవుంది. సివిలుఖైదీకి అయ్యేఖర్చులన్నీ అవతలవాడే ముందుగా దాఖలుచెయ్యాలి. సంకెళ్ళుగింకెళ్ళు యేమీవేయరు. ఏదోఒకనెల చూస్తారు అల్లా ఖయిదులోపెట్టితే సిగ్గుచేత యిస్తాడేమో అని చేస్తారు మొండివాడయితే వదిలివేసిఒకనమస్కారము చేస్తారు.

సింహా—మీకడుపులో మాచెడ్డవూహాలున్నాయండి. రండి. చాలా ప్రొద్దెక్కుతుంది. మీరింకా భోజనానికి వెళ్ళిరావాలి.

వెంక—ఈవాళ నేను హోటలుకువెళ్ళలేను. ఇక్కడికే భోజనం పంపమన్నాను. ఇంకాస్సేపటికి బ్రాహ్మణకుఱ్ఱవాడే యిక్కడకు పట్టుకొనివస్తాడు.

సింహా—మీరు వెళ్ళేది యేమిటి. రోజూవచ్చేటట్టు అల్లాయేర్పాటు చె
య్యండి. తెచ్చినందుకుఒకరూపాయి యెక్కువయియ్యవచ్చును.
వెంక—అల్లాగేచూడాలి. లేకపోతేయీమూలనుంచి ఆమూలకువెళ్ళ
డంచాలాకష్టంగావుంది. కానిచూతాం. ఈవాళగడిచిపోనియ్య
రా. త్వరగాబోంచేసి ప్లీడరుగారియింటికికూడా వెళ్ళాలి.
(నిష్క్రమింతురు.)

---

[రంగము—సింహాచలము—చంద్రవదన.]

చంద్ర—ఇదేమిటే అమ్మాయీ. చూస్తూచూస్తూవుండగానే యిల్లా
అయింది. మనవెంకట్రామయ్యగారు మంచంయెక్కినారు. గుం
డెలన్నీ యెండిపోయినాయి. డాక్టర్లకు యెంతమందికి చూపిం
చినా కార్యంలేదని చెప్పుతున్నారు.
సింహా—భగవంతుడుచేసేదానికి మనము కర్తలమా. చాలారోజుల
నుంచి నన్నుకనిపెట్టివున్నారుగనుక యీసమయంలో మనం
కాస్తడబ్బుకు లోభించకుండా వైద్యంచేయించాలి. లేకుంటే
మనమూరుకొన్నామంటే యెటుబోయియెటువచ్చినా అపవా
ద మనకు వస్తుంది.
చంద్ర—నువ్వన్నమాట నిజమే. నిన్నవచ్చిన డాక్టరుగారు గుండెల
న్నీ తనిఖీచేసి అతితాగుడుచేత ఖలేజాఅంతా తినేసింది. మం
దువల్ల మాత్రికులవల్ల లాభంలేదు అన్నారు.
సింహా—అంతేకాకుండా, నేనుపైగాతిరిగేవిషయం ఆయనకు బాగా
తోచింది. రెండుమూడుసారులు ఆయనగదిలోనికి వచ్చేటప్పు
టికి శ్రీనివాసులు నేనూ తలుపువేసుకొని కూర్చోటం ఆయన
బాగాచూచినాడు. దీనిచేతకూడా ఆయనకు యీజబ్బుకుతో
డు చెంగ అధికమైపోయింది. ఆయన సాధారణంగా బ్రతుకు



తౌడనితోచదు. అయినప్పటికి మనశక్తికి వంచనలేకుండా వై
ద్యంచేయిస్తే మనలోపం కనిపించదు.
చంద్ర—ఇక్కడ ఆయనకు పత్యపానాలు పరాయిబ్రాహ్మడినిపెట్టి
చేయించాలి. పోనీ నెమ్మదిగా యింటికివెళ్ళితే అన్నలు, వారూ
వున్నారు. వాళ్ళు కావలసినట్టు వుపచారంచేస్తారని చెప్పుదామ
నుకొంటే ఆయనకు మనస్మృతిలేకుండావుంది. ఇదంతా మన
నెత్తిమీద అపవాద పడడానికివచ్చింది.
సింహా—ఏమయినా మనంయీపూట ఆయన అన్నగారికిటెల్లిగ్రాము
యిస్తే బాగావుంటుంది. వారువచ్చి యేమయినా ఆలోచించు
కొంటారు. మనము వూరుకొంటె ప్రయోజనంలేదు. రా.
త్వరగావెళ్ళి టెల్లిగ్రామువ్రాయించి ఆఫీసుకు పంపుదాం.
(నిష్క్రమింతురు.)

---

రంగము:—సింహాచలము మందిరములో వెంకట్రామయ్య,
జగన్నాధము, వైద్యుడు మొదలయినవారుందురు.

జగ—తమ్ముడూ ఇల్లా ఒకసారిచూడు తండ్రీ! నీకెంతగతివచ్చిందో
యి. కావలసినంత ఆస్తివున్నవాడవు. హాయిగా యింటికాడ
కూర్చుని తిని సుఖంపొందకుండా కానివాళ్ళవచ్చి యిల్లా అ
యిపోయినావా! నిన్నుచూస్తే నాకళ్ళంబడినీళ్ళు ప్రవాహము
మోస్తరుగా పాఱుతూవున్నవి. నీవుబ్రతికివుంటేనే మాకు యే
మయినావుందిగాని నువ్వులేకపోతేమాబ్రతుకేమిటి? పండంటి
శరీరం యెల్లాఅయిపోయిందిరా. ఆభగవంతుడికంటికి బాధపె
ట్టడానికి నువ్వేకనపడ్డావా తండ్రీ!
వెంక—అన్నయ్యా! నీవుపూరికే విచారించడమువల్ల ప్రయోజనంలేదు.
ఇదిఅంతాస్వయంకృతాపరాధము. మహాఆస్తిపరుడనని గర్వించి

యీచంద్రవదనకూతురు సౌందర్యంఅనేటటువంటి మోహసా
గరంలో పడిపోయి తాగుడుకు అలవాటుపడి సమస్తమయిన
ఆస్తినిపాడుచేసి తుదకుబాధ్యగ్రస్తుడనైతిని. ఎంతధనముయిచ్చి
నను వేశ్యలుఒకనిని నమ్మియుండరని నాకు బాగా తెలిసింది. నే
నుపాడవడానికి సింహాచలమే కారణము. ఇప్పుడేమన్నను లాభ
ములేదు. అదినామీద అనురాగంచూపిందల్లా డబ్బులాగడం
కోసం అనినేను తరువాత తరువాత అనుకొన్నాను. నేనెంతడ
బ్బుయిస్తూవున్నా తృప్తిబొందక యితరులంగూడుటకన్నులార
చూచినాను. విశ్వాసంకలదని నేనెంతయోడబ్బుదీనికిచ్చినాను.
ఇంతయేల. నాయాస్తిపాడవడానికియిదేకారణం. వళ్ళు,పై తె
లియకుండా తిరిగిన నావంటినిర్భాగ్యుడిల్లాటి స్థితిపొందవలసిన
వాళ్లే, అనేకులు వేశ్యలవలనపాడైనారను సంగతి తెలిసివుండీ
కూడా యిల్లా అయిపోయినాను. "మహాసముద్రముయొక్క
లోతయినా తెలుస్తుందిగాని వేశ్యామోహసాగరానికి మాత్ర
ము లోతు తెలియదు. ఇదిమహాఅగాధము. వేశ్యలను వుంచు
కొన్నవాళ్ళు యెవ్వరూబాగుపడలేదు. అంతాదుర్మరణాలే చెం
దినారు. ఈవేశ్యలకు కరుణయన్నదినాస్తి. కటాక్షము భూగో
ళము. నిశ్చలమైనమనస్సు హుళక్కి. నిశ్చలమైనచిత్తం సున్న.
వావివరుసలు పూజ్యం. అనురాగంచుక్కెదురు. కంచు కాగ
డా వేసిచూచినాగానికడుపులోయెక్కడాప్రేమవుండదు.వీరితో
మైత్రి ధననాశనంబగుటయేగాక ప్రాణనాశనంబుగూడనగును.
అగ్నిహోత్రునిసాక్షిగా పెండ్లాడినభార్యనువదలి ఈవేశ్యలను
జేరినవారిబ్రతుకులిట్టివే. ఈవేశ్యలుండుటచేతనే పెక్కండ్రుపు
రుషులు పాడయిపోవుచున్నారు.సంఘసంస్కరణాభిలాషులు
వేశ్యలవిజృంభణమునాపి వీళ్లనుగూడసంసారులనుజేసి, తక్కిన



కులములతోపాటు వివాహములుచేసినచో బాగుండును.

జగ—తమ్ముడా ఈబుద్ధి మొదలనేవుంటే యిన్నియవస్తలువస్తాయా.

వెంక—అన్నయ్యా ఏదేహికెల్లాఅవాలో అల్లాగవకతప్పదు. అంతా
భగవదధీనం. ఇప్పుడిక చింతింపబనిలేదు. నేనుబ్రతుకుట అస
త్యము. కాబట్టి నామాటవిని అన్నయ్యా, నాయందు దయ
వుంచి నేనుచెప్పినట్లుచెయ్యి. నాకువుండుకొన్నఆస్తిఖరీదుగట్టిన
యెంచుమించుగా లక్షరూపాయలవును. అందులో 63 వేలు
అప్పులకుపోను. ఇక 37 వేలలోను 7 వేలరూపాయలువేశ్యపి
ల్లలకు వివాహాలనిమిత్తంయిచ్చి 25 వేలు నాభార్యకిచ్చి కు
మారుడిని దత్తతచేసుకోనివ్వు. తక్కిన అయిదువేలును నా
విషయమై ఖర్చుచెయ్యి. నాభార్య సాధ్విగనుకనే నేనిట్టియకా
ర్యములుచేయుచున్ననుసైరించియూరకొన్నదిగాని మరొకరై
నచో యీపాటికేనుయెన్నోగోయెన్నో చూచుకొనియే యుండు
ను. నీవు నాయందు దయవుంచి దానితో "ఇంతధనవంతుడని
యైయుండి నీమొఖంచూడక వేశ్యమాయలోబడిబ్రతికియుండి
యు నిన్ను నాశగాసల్పినపాపుడను. నీవునావిషయమై విచారింప
క యన్నగారు చెప్పినచొప్పుననుండి తనువువెళ్ళదీసుకొనుము.
ఆతడునీకుఇరువదైదువేలొసంగగలడు. అదిజాగ్రత్తగావడ్డీకివేసి
కొంటే కావలసినంతఅగును. నీవొకపిల్లవాడిని నాఅన్నగారు
చెప్పినవానిని పెంచుకొని నేనెంత దుర్మార్గప్రవృత్తిబూనిచరిం
చినను నాపేరు నిలబెట్టుము" అనిచెప్పితినని చెప్పుము. అన్న
య్యానీకు సమస్తము తెలిసేవుంది. నేను చెప్పవలసినవాడిని
గాను. దానినిరక్షించేభారముంతానీది. ఈఆస్తులవిషయమై క్రి
మునైన స్టాంపుమీద వీలువ్రాస్తాను.

జగ—తమ్ముడా నీవధైర్యపడకుము.

వెంక—అన్నా ఇంకా వైద్యమేమిటి? కాలదండముపుచ్చుకొని యముడునన్ను తీసికొనివెళ్ళడానికిసమయంకోసంకనిపెట్టుకొనివున్నాడు. గుండెల్లో మాధడగావుంది. నాలుకఆర్చుకొనిపోతూవుంది.

జగ—నేనువెళ్ళి జిల్లాసర్జనుగారినైనా తీసికొనివస్తాను. మరేం భయపడకు.

(అందరు నిష్క్రమింతురు.)

---

రంగము:—[మోహిని—అలివేణి—మందిరములో ప్రవేశము.]

మోహిని—అలివేణీ! రోజూమనయింటికి సంగీతంచెప్పుకోడానికివచ్చే ఆకోమట్లమ్మాయి రాలేదేమి? రోజూయీపాటికల్లావచ్చేదే.

అలి—వస్తుంది పిల్లకాదా ఏపిల్లలన్నా ఆడుకోడానికివస్తే ఆటరంధిని పడ్డదేమో.

మోహి—నేనోరహస్యం చెప్పుతాను. నీవు కాస్తన్నా బయలుపెట్టకుండావుండాలి. బయలుపడ్డదంటే మనప్రాణాలుదక్కవు. ఈ కార్యం మనంచేస్తిమా మనకు చాలాడబ్బువస్తుంది. ఎంతమందిదగ్గరకువెళ్లి ఎన్నిరూపాయలు తెచ్చుకొంటే పదివేలురూపాయలవుతాయి.

అలి—డబ్బులాభించేపనిఅయితే యెల్లాటిపనిఅయినా చేదాము.

మోహి—నేననుకొన్నపనిసామాన్యపుదిగాదు. మహాసాహసంవుండాలి. ఈరహస్యం మనయిద్దరిలోనే వుండాలిగాని మూడోకంటికి తెలియకూడదు.

అలి—ఎందుకుతెలుస్తుందిలే. జాగ్రత్తగానే చేయవచ్చును. అదియేమిటో చెప్పు?

మోహి—నీవుయెవ్వరితోనూ వెల్లడిచేయనని యిల్లాటిపని నీతోకలిసిచేదామని చెప్పుతున్నాను. గనుక నీవుకూడా మహాజాగ్రత



గావుండాలి. ఏమిటనగా, మనయింటికివచ్చే కోమట్లఅమ్మాయిని చూచినావా?

అలి—చూడకేం. రోజూచూస్తూనేవున్నాను.

మోహి—అదికాదే. వంటిమీద యెన్నినగలున్నాయో.

అలి—వడ్డాణం, పుసుచ్చేరీనాను, బంగారపుతాడు, కట్టడపు కాసులపేరు, గజ్జలపట్టెడ, మురుగులు, ముదుగొలుసులు, కంటె, తోడాలు, వంకీలు యింకాయేమిటో చాలావున్నాయి. అన్నిరెండువేలరూపాయల ఖరీదుగల వస్తువులున్నవి. అయితేనేం.

మోహి—అవిమనము యెల్లాగయినా సంగ్రహించాలి.

అలి—ఇదా నీవు డబ్బులాభంఅనిచెప్పినావు. ఆఅమ్మాయివంటిమీద నగలు మనకెల్లావస్తాయి. అందనిపళ్ళకు చేతులుజాపితే ఏంలాభంవుంది?

మోహి—ప్రయత్నంచేస్తే రాకేంచేస్తాయి.

అలి—ఎలాగ ప్రయత్నంచెయ్యడం. నోరెరుగనిపిల్లగనుకనా. మెళ్లోవితెంపుకొని సాగనంపడానికి?

మోహి—అల్లాటిఅభిప్రాయంకాదు. (ఇటుఅటుచూచి) ఎవ్వరూలేరుగదా. విన్నారంటే కొంపమునుగుతుంది, గుప్పుచప్పుగాకుండా పిల్లను చంపడమే.

అలి—అయ్యబాబో నువ్వు ఆమాట అనేటప్పటికే నాకాళ్ళల్లోనుంచి వణకుపుట్టుకొని వస్తూవుంది. దిక్కుమాలినడబ్బు లేకపోతేపోయిందిగాని యిల్లాటిపని చేసినామంటే ప్రాణాలువుంటాయా. ఇల్లాటివిదాగుతాయా. అమ్మయొయ్యో! మోహినీ నీకు యిల్లాటిబుద్ధి పుట్టిందేమే? ఇల్లాటివ్యూహాలు యెప్పుడూ మనస్సులో పెట్టుకోకు. కొంపలు-మునుగుతాయి,

మోహి—నీవెక్కడో వెఱ్ఱిమొగంలావున్నావు. మనయింట్లోగదిలో గుప్పుచప్పుగాకుండా చేసేయీపని యెల్లాబయలుపడుతుంది? నీవావిషయమై సందేహించవద్దు. కావలసినంతడబ్బు గుభాలుమని చేతిలోపడుతుంది. యెన్నాళ్లుసంపాయిస్తే యింతడబ్బు వస్తుంది. నీవేమీ భయమున్నూ అనుమానమున్నూ పడవద్దు. దీనివిషయమై నేను తగినప్రియత్నంచేస్తాను.

అలి—యేమోగాని యిల్లాటిపనిచెయ్యడానికి నామనస్సుఒప్పుకోడంలేదు. యిదిచాలా పాపమని భయమేస్తూవుంది.

మోహి—పాపమునానీకుభయమేస్తూవుంటూ! పిచ్చిదానా మామనంచేసేపనులన్నీ పాపంగాదా. అంకురితనంచెయ్యడంపుణ్యమేనా యేమిటి? ఇల్లాఆలోచిస్తే జగంలో మనం యేపనిచేయలేము. రెండోకంటివాడికి తెలియకుండా యీపని మనముచేస్తాము.

అలి—నేనేంచెప్పగలను. డబ్బులేకపోతే ముష్టెత్తుకోవచ్చునుగానియిల్లాటిదారుణపుపనులుచేస్తే చాలా పాపమేకాకుండా నలుగురులో తలయెత్తి బ్రతుకలేము. కాబట్టి నీవు నామాటవిని యీపూనికమానివేయి లేదా తరువాత నీయిష్టము.

మోహి—ఈవిషయంలో నీవు నామాటకెదురుచెప్పకు నీకేమీ భయంలేదు. నీప్రాణానికి నాప్రాణం అడ్డువేస్తాను.

అలి—ఇకనీయిష్టము. నీకు నేనుయెదురుచెప్పలేనుకాని యీదారుణహత్య మనయిద్దరివల్ల అవుతుందాఅని సందేహంగావుంది. మనము ఆడవాళ్ళము.

మోహి—నీకాసందేహం అక్కరలేదు. నేను మనమద్దెలసోమన్నతో మాట్లాడినాను. ఆతడికిందులో వాటాయిస్తానన్నాను. వాడు వప్పుకొన్నాడు.

అలి—కాని బహుజాగ్రిత్తగాచేయాలి.



మోహి—అదుగో ఆకోమట్ల అమ్మాయి లక్ష్మమ్మ వస్తూంది. ఈపని సంగతి యేమీయెత్తకు. ఈపిల్ల భోంచేసి వచ్చినట్లున్నది. పరవాలేదు. కూర్చోపెట్టినెమ్మదిగా సంగీతం చెప్పుతూవుండు. సోమన్నను పిలుచుకొనివస్తాను. చేయదలంచుకొన్న కార్యం యిప్పుడే చేసెయ్యవచ్చును. (నిష్క్రమించును.)

అలి—(తనలో) నాహృదయంలో యిల్లాటితుచ్ఛపుకోరిక లేకపోయి నా యీపిల్ల వంటిమీద వస్తువులు చూచేటప్పటికి నాకూ తెగులుపుట్టింది.

[లక్ష్మమ్మ ప్రివేశము.]

అలి—అమ్మాయీ వచ్చావూ! దా అమ్మా.

లక్ష్మి—మోహిని యేది ?

అలి—వస్తుంది కూచో. పాఠం వల్లించావా !

లక్ష్మి—ఓమోస్తరుగా వచ్చింది. రాత్రిపాడుకుందామనుకొంటే మాయింటికి యెవరో బంధువులువచ్చినారు. వారు భోజనాలుచేసి వెళ్లే హడావిడిలో పడిపోయినాను. కాస్త తెల్లవారజామున లేచి చదివినాను.

అలి—ఏది నువ్వు చదివింది పాడు.

లక్ష్మి—పొస్తకం మఱిచిపోయినాను యింటివద్ద పెట్టి.

అలి—పోనీలే. ఆగీతము మోహినికి వచ్చును. అది వస్తుంది వుండు.

[మోహిని ప్రివేశము.]

అలి—అదుగో మీమోహిని వచ్చింది. ఇంక నీ యిష్టము. దాని యిష్టము.

మోహి—ఇదేమిటి లక్ష్మమ్మా! చావిట్లో కూర్చున్నావు. గదిలోకి పదా.

లక్ష్మి—ఎక్కడయితేనేం కూర్చోవడానికి ?

మోహి—నీవుమాటలు మహానేర్చావు పదవో. (గదిలోనికి తీసుకొని వెళ్లును.)

లక్ష్మి—నువ్వెక్కడికి వెళ్లినావు?

మోహి—కొద్దిగాపనిమీదవెళ్లినాను.నువ్వెంతసేపయిందేమిటివచ్చి?

లక్ష్మి—ఇప్పుడే వచ్చినాను?

మోహి—ఏం ఈవాళ చాలా ఆలస్యంచేశావు?

లక్ష్మి—తలకు నీళ్లుపోసుకొని భోంచెయ్యడం ఆలస్యమైంది.

మోహి—అందుకనే తాంబూలం జాడించావు.

లక్ష్మి—ఏమిటో భోంచెయ్యగానే అలవాటు.

మోహి—పొద్దున్నే అప్పుడే వంట అవడం భోంచెయ్యడం కూడా అయింది. యేమి వేసుకొనితిన్నావు?

లక్ష్మి—ఏముంది. కందిపచ్చడి, వంకాయకూర, ఉల్లిపాయపులుసు.

మోహి—మీకోమట్లకు ఉల్లిపాయఅంటే బహిఃప్రాణంగదా.

లక్ష్మి—మీరు తినరా యేమిటి?

[సోమన్న ప్రవేశము.]

సోమన్న—ఏం మోహినీ.

మోహి—అంతా సిద్ధంగానేవుంది.

లక్ష్మి—సిద్ధంగా వున్నదేమిటి?

మోహి—వేరేసంగతిలే. (సోమన్ననుచూచి కన్ను గీటుచున్నది.)

సోమ—(గదిలోకివచ్చి) కోమట్ల అమ్మాయా ఏమిటి! సంగీతం నేర్చుకోవడానికి వస్తూవుంటుందా యేమిటి? ఈఅమ్మాయికి పెళ్ళి అయిందా?

మోహి—అయింది.

లక్ష్మి—నేను వెళ్లిపోతాను తరువాత వస్తాను.

మోహి—సిగ్గుపడకు మద్దిలవాయించే అతడేలే.



సోమ—అమ్మాయి వంటిమీద చాలనగ లున్నాయే. (లక్ష్మమ్మను చూచి) అమ్మాయీ! యిన్నినగలు నీవుమోయలేవు. నాకు యిచ్చివేద్దూ నీపేరుచెప్పుకొని హాయిగా వేసుకొంటాను.

అలి—ఆపిల్లను అల్లామాట్లాడించకు సిగ్గుపడుతుంది.

సోమ—అయ్యబాబో. ఇల్లాసిగ్గుపడేపిల్ల రేపుమొగుడుతో కాపురము యేలాచేస్తుంది.

లక్ష్మి—ఇదేమిటిమోహినీ. ఈలాటిమాటలంటాడు యితను. నేనువెళ్ళిపోతాను.

మోహి—వెళ్ళవచ్చును లేవమ్మా. వెళ్ళియింటికాడ ఏంచెయ్యాలి. (తలుపుదగ్గిరసావేయును.)

అలి—సోమన్నా! వీధితలుపు వేశేవుందా.

సోమ—వెయ్యకుండా వుంటానా.

(సోమన్నకూడా గదిలోప్రవేశించును)

లక్ష్మి—ఇదేమిటి. తలుపుదగ్గిరవేశావు. ఇతనుకూడా లోపలికివచ్చినాడు యెందుకు?

మోహి—నీకోసమే.

లక్ష్మి—ఇల్లాటిమాటలన్నావంటే నాకు కోపంవస్తుంది. నేను వెళ్ళిపోతాను.

మోహి—మావలలోచేపచిక్కినట్లు చిక్కినావు. ఎక్కడికివెళ్ళగలవు?

లక్ష్మి—నన్ను వెళ్ళనియ్యవా యేమిటి?

మోహి—వెళ్ళనీయడానికి గదిలోనికి తీసుకొనిరాలేదు.

సోమ—(కత్తిచూపి) ఆనగలుతీసి అక్కడపెట్టమను త్వరగా.

మోహి—లక్ష్మమ్మా. ఆవస్తువులుఅన్నీ తీసి అక్కడపెట్టు.

లక్ష్మి—(తొందరలో) వీళ్ళునావస్తువులు తీసుకోవడంకోసం కాబోలు నెమ్మదిగా యీగదిలోనికి తీసుకొనివచ్చినారు. వస్తువులుయియ్యకపో

తే చంపుతా రేమోకదా. నాకెందుచేతనోవళ్ళంతాబిగుసుకుం
టూవుంది. (ప్రకాశముగా) నావస్తువులు మీకెందుకు?

సోమ—మాకుకావాలి. తక్షణంతీశెయ్యి. ఇంకనిన్ను వదలము. వస్తు
వులుతీసుకొని నిన్ను సఫాచేయడానికే తీసుకొనివచ్చినాము.

లక్ష్మి—(తనలో) అన్నా వీళ్ళునన్ను చంపేసినగలు వల్చుకోవడంకో
సం యిల్లాచేస్తున్నారు. (ప్రకాశముగా) నేనుమాయింటికి వె
ళ్ళుతాను నన్ను వెళ్ళనీయండి.

సోమ—మోహినీ. చూస్తావుయేమిటి? ఆలస్యంచేసినకొలదీ మనకుక
ష్టము. మెళ్ళోవున్నవన్నీ నెమ్మదిగా కత్తిరించండి. తరువాత
గొంతుక్కాయమీద ఒకయేటువేస్తాను.

మోహి—(లక్ష్మమ్మమెడలో చేయిపెట్టి బలవంతంగా వస్తువులుతీసు
కొనును.)

లక్ష్మి—నావస్తువులు మీకుయిస్తాను. నన్ను ప్రాణాలతో వదిలివె
య్యండి. మీకుదణ్ణంపెట్తాను.

సోమ—నిన్ను వదిలివేస్తే మాకొంపతీయవూ.

మోహి—గట్టిగామాట్లాడకు.

సోమ—ఇంకాఆలోచనయెందుకు (కత్తియెత్తును.)

లక్ష్మి—అయ్యో. నన్నుచంపకండి. రక్షించండి. మీకాళ్ళు పట్టు
కొంటాను.

సోమ—కేకలువెయ్యకు. (పట్టుకొనగా గింజుకొనును)

మోహి-అలి—కాళ్ళుచేతులు పట్టుకొందురు.

లక్ష్మి—బాబో. బాబో.

సోమ—(నఱుకును.)

మోహి—చచ్చింది.



అలి—రక్తం ప్రవాహంమోస్తరుగాకారుతూవుంది. ఇప్పుడీమొండేలు
యెక్కడదాద్దాము?

మోహి—ఇప్పటికి అటుకుమీదబెట్టి రాత్రిరెండుఝాముల అప్పుడు
పాతివేద్దాము.

సోమన్న—సరే ఆపనిచేదాము.

(నిష్క్రమింతురు)

---

రంగము:—(మోహినియింటివద్ద—పోలీసుయిన్స్పెక్టరు
పోలీసుకాన్స్టేబిలుసాహెబు)

పో-ఇ—ఏమోయిజవానూ. పాపమాకోమట్లఅమ్మాయి పొద్దుట
నుంచి యిప్పటివరకు కనబడడంలేదట. మనఆఫీసుకు రిపోర్టు
యిచ్చినారు. వంటిమీద రెండువేలరూపాయల నగలున్నాయ
ట. పాపము. నాకుచూడగా యెవరైనా ఆవస్తువులకోసంఆశ
పడి అవితీసుకొని చంపేశారని తోస్తూవుంది. ఆఅమ్మాయిసా
ధారణంగా రోజూవెళ్ళేయిళ్ళన్నీ సోదాచేసినాము. కానిఆచో
కీమేమీచిక్కలేదు. ఈభోగందానింటికీ రోజూపాట నేర్చుకో
డానికి వస్తూవుంటాదట. ఇక్కడకూడాచూదాం.

కా-సా—చూడండిమహారాజ్ వీళ్ళకీకంచనులు. బడాబడామాదర్చో
దులు. వీళ్ళకియెంతపని చేసినాచేస్తారు. నాకుయీాళ్ళమీదేనిం
డాఅనుమానంవుంది. ఇప్పుడు మనము అంతాఖరీచ్చచేస్తేసం
గతి తెల్సాది.

పో-ఇ—సరే. లోపలికివెళ్ళుదాము. తలుపుతీయుమని పిలువు.

కా-సా—లోపలాకౌనహై. దర్వాజాతీయండి. (తలుపుకొట్టుచు కేక
లువేయును)

మోహి—(తలుపుదీసి) ఎందుకండీ. సాయాబుగారూ?

కా-సా——ఎందుకండీయేమ్టి. అందుకనే. బాక్కలెగు. ఇన్‌స్పెక్టరుసాబ్ వచ్చినారు. జల్దీమీయిల్లు సోదాచెయ్యాల. మీయింటికి సంగీతం సెప్పుకోడానికి వచ్చేకోమ్టికుట్టది యియ్యాలపొద్దుటి నుంచి కన్పించడంలేదు.

మోహి——ఈవాళమాయింటికి సంగీతం చెప్పుకోడానికిరానేలేదు. (ఇనస్పెక్టరుగారినిచూచి) దండాలండీ. (తనలో) అయ్యో ఇప్పుడేమిచెయ్యను. నఱికినముండెములు రాత్రియెక్కడనన్నా పాఱవేద్దామని అనుకుంటూవుండగానే పోలీసువారువచ్చారు అక్కటా. ఇప్పుడేమిచేయను. అయినా ఆపిల్లను నఱికినగదికి తాళం వేశానుగదా. పోలీసువారు ఆవలిస్తే పేగులులెఖపెట్తారు. భగవంతుడిదయవల్ల గుట్టుబయలుపడకుండా వుంటేసరిగాని లేకపోతే మాఅందరిప్రాణాలు పోయినట్టే. అలివేణి యెంతవద్దని బోధించినాగాని వినకుండా యింతదారుణహత్య యెందుకుచేశానోగాని భగవంతుడా యిప్పుడు నీవురక్షించాలి. సోమాలమ్మతల్లీ. ఈగండంగడిస్తే నీకుచీరాపసుపు కుంకంవచ్చేవారం పట్టుకొని వచ్చియిస్తాను.

పో-ఇ——నీవేనా యీయింటికి యజమానురాలవు?

మోహి——అవునండి.

పో-ఇ——నీదగ్గిరసంగీతం చెప్పుకోడానికి రోజూ యెంతమంది వస్తూవుంటారు ?

మోహి——నేను యెవ్వరికీచెప్పడం వృత్తిగాపెట్టుకోలేదు. ఒక్కకోమట్లఅమ్మాయిమాత్రం ప్రతిరోజూసరదాకు పాటలునేర్చుకోడానికి వస్తూవుంటుంది.

పో-ఇ——ఆఅమ్మాయిపేరు ఏవరు?



మోహి——లక్ష్మమ్మ.

పో-ఇ——ఆఅమ్మాయి యీవాళరోజున పొద్దున్న మీయింటికి వచ్చిందా?

మోహి——నేను పొద్దున్నయింట్లోలేను. కొద్దిగాపనిమీద వెళ్ళినాను.

పో-ఇ——ఇప్పుడుబంట్రోతుతో ఆపిల్ల యీవాళమాయింటికే రాలేదని చెప్పినావే.

మోహి——నేను చూడలేదుగనుక రాలేదనుకొన్నాను.

పో-ఇ——నువ్వుయింటోలేనప్పుడు యిల్లుతాళంవేసి వెళ్ళినావా. లేకయింటో యెవ్వరన్నావున్నారా.

మోహి——మావాళ్ళే. అలివేణిఅని యింట్లోవుంది.

పో-ఇ——ఇప్పుడదియేది?

మోహి——ఇంట్లోవుందండి.

పో-ఇ——సాహెబు దానిని పిలుచుకొనిరా.

కా-సా——అచ్ఛా. (లోపలికివెళ్ళి అలివేణితో ప్రవేశించును)

అలి——(ఇనస్పెక్టరుగారినిచూచి) దండాలండీ.

పో-ఇ——పొద్దున్నమీయింటికి లక్ష్మమ్మఅనే కోమటిపిల్ల పాటనేర్చుకోడానికివచ్చిందా?

అలి——(తనలో) కొంపమునిగింది. అయ్యబాబో యిప్పుడేం చెప్పను. (ప్రకాశముగా) వచ్చిఅప్పుడేవెళ్లిపోయింది. ఈవేళ అట్టేసేపు కూర్చోలేదండీ.

పో-ఇ——అప్పుడుమోహిని యింటోవుందా.

అలి——ఆఅమ్మాయి వచ్చేటప్పటికి మోహిని యేదోపనిమీద వెళ్ళి వచ్చింది. మోహినిరాగానే యీపూటమాయింటికి యెవ్వరో బంధువులువచ్చినారు అనిచెప్పేసి వెళ్ళిపోయింది.

పో-ఇ——ఎవ్వరితో చెప్పింది?

అలి—మాయిద్దరితోనూ చెప్పింది.

మోహి—(తనలో) ఇదికొంపతీసింది.

కా-సా—దేఖో. మహారాజ్. ఏకంచన్ కైసాబోత్తే బడాఅద్మే.

పో-ఇ—మీరాపిల్లను యేంచేసినారోఅనిమాకుపూరాఅనుమానంగా వుంది.

మోహి—ఆపిల్లను మేమేమీచేసామండి. సరదాకు కాస్తపాట చెప్పమని వస్తూవుంటే చెప్పుతున్నాము.

పో-ఇ—ఆపిల్లసాధారణంగా మీయింటికి తప్ప మరియెవ్వరియింటికి వెళ్ళదట. కాబట్టి నిజంచెప్పండి. మీరు నిజంచెప్పకపోయినా మేముకనిపెట్టగలము. మాకుశ్రమయియ్యకుండా చెప్తేమాకు చాలాసంతోషమవుతుంది.

కా-సా—సర్కార్. వీళ్ళఆకురిదాన్ని మర్గయాచేసివుంటారు మనము లోపల్కి వెళ్ళిసూద్దాం.

పో-ఇ—మమ్మల్ని లోపలికివెళ్ళనియ్యండి. మేముదొడ్డియిల్లుఅంతా సోదాచేయాలి.

మోహి—అనుమానంవుంటేచూసుకోండితండ్రి.మాకేంభయంవుంది.

పో-ఇ—(లోపలను దొడ్డియు వెతకివచ్చి తాళమువేసివున్నగదిని చూచి) ఈగదితాళంకూడా తీయండి.

అలి—(తనలో) అయోఅయ్యో ఇంకేముంది కొంపమునిగిపోయింది.

మోహి—ఈగది మాకింద లేదండి. ఒకఆడమనిషి ఇందులో అద్దెకువుండేది. సామానులందులోపెట్టుకొని తాళంవేసుకొనివెళ్ళింది.

కా-సా—జూటాబాత్ సర్కార్.

పో-ఇ—ఆడమనిషి అద్దెకుండడంలేదు గద్దెకుండడంలేదు మాకు తాళంబద్దలుకొట్టి చూడడానికి అధికారంవుంది నీవు దీనితాళం [illegible]స్తావా! మేము బద్దలుకొట్టమా.



కా-సా—సాబ్ నాదగ్గిర దీనికి సరిపోయేతాళంవుంది.

పో-ఇ—వుంటే తియ్యిచూస్తావుయెందుకు?

కా-సా—(తీయుచున్నాడు)

మోహి—అందులోసామాను యేమయినాపోతే అద్దెకువున్న మనిషి మామీదపెట్టుతుందండీ.

పో-ఇ—పర్వాలేదు (తలుపుతీసుకొని లోపలికివెళ్ళి) సాయీబా ఇక్కడనేలమీద రక్తం కాజినట్లున్నది.

మోహి—(తనలో) ఇంకేముంది. కొంపమునిగింది.

కా-సా—(స్థలముపరీక్షించి) హాఁ. మహారాజా! ఇక్కడమనిషినిచంపినట్లు కనపడుతూవుంది. (అటుకు కేసి పరీక్షించిచూచి) దేఖో మహారాజ్ పైనుంచిరక్తపుచుక్కల్ పడుతున్నాయి.

పో-ఇ—అవును. సాయీబూ పైకెక్కిచూడు.

కా-సా—ఏకంచెన్ నీకొంపమునిగిందిరా నిచ్చెనతీసుకొనిరా.

మోహి—పైనయేదన్నా పిల్లిగిల్లి దెబ్బతగిలి చచ్చిందేమోనండి.

పో-ఇ—ఎవిచస్తే నేమిలే. ముందు నిచ్చెన తీసుకొనిరా, ఆట్టేమాట్లాడకు (సాహేబును జూచి) సాహేబ్ ఇంట్లోవాళ్ళు అవతలికి వెళ్ళిపోకుండా వాకిట్లో పోలీసుజవానులున్నారా!

కా-సా—హాఁయ్ మహారాజ్.

మోహి—(తనలో) నాకు వినాశకాలం సమీపించడంచేతనే యిట్టిదారుణపుపనిచేసినాను. ఇంక నాకు చావుతప్పదు. (నిచ్చెన తెచ్చి యిచ్చును)

కా-సా—(నిచ్చెనపైనుంచి పైకెక్కి) మహారాజా! వీళ్ళుబడే దారుణకార్యంచేశారు. ఆడపిల్లే దీన్కిసంపి రెండుముక్కలేసిదీనిమీదవుంచినారు.

మోహి—అయ్యో! ఇదియేమి! ఈమేమియా ఎఱుగమండీ ఎవరు తెచ్చి పెట్టినారో భగవంతుడా!

పో-ఇ—వీళ్ళను ముందు అరెస్టుచేసి స్టేషనుకు తీసుకొనిపో. ఈశవాన్ని పైనుంచి తీయించి డాక్టరుపరీక్ష మొదలయినవి చేయించాలి గ్రామమునసబును వాళ్ళను పిలిపించాలి.

(పోలీసుజవానులు అలివేశిని, మోహినిని సంకెళ్ళువేసి స్టేషన్కు తీసుకొనిపోవుదురు.)

---

[రంగము—కారాగృహము—మోహిని]

మోహి—(తనలో) పాపం దాగదనేచెప్పేమాట అబద్ధమవుతుందా. అలివేశి వద్దనిఅంటూవున్నా నాకు చేటుకాలంరాబట్టి యింత దారుణం నేను చేయించాను. ఇప్పుడేమిచేస్తే యేమిలాభంవుంది. హత్యా మేమేచేసినామని నేరంమోపబడి, సోమన్నకు, అలివేశికీ నాకు ద్వీపాంతరశిక్ష విధించినారు. నాపాపం నన్నే కట్టికుడిపింది. నేనిల్లాటినీచమైనపనిచేసి మాకులానికల్లా అపకీర్తితెచ్చినాను. వ్యభిచారంచేసేవాళ్ళు యెంతదారుణపుకార్యాలయినాచేస్తారు. కాకపోతే నాకీపాయ్యకాలం మొదుకుపుట్టాలి. పోనీ. లోకంలోనైనా యికనుంచి నన్నుచూచియైనా ఆడవాళ్లుగాని మగవాళ్లుగాని యిట్టిహత్యలుచేయకుండా వ్యభిచారవృత్తిలో వుండడముచేత నేయిల్లాటిసాహసపువనులుచేయడానికి బుద్ధులుపుట్టుతూవుంటాయి. ఈూలో యీవ్యభిచారవృత్తిమానిపించి విధిగాపెళ్ళిచేసుకొనేమార్గముగవర్నమెంటు ర్యూలు ప్యాసుచేస్తే బాగుంటుంది. ఓవేశ్యస్త్రీరత్నములారా! మనమూయెంతఆలోచించినా ఈవ్యభిచారంవలన లాభములేదు. ఈవ్యభిచారంపిశాచము మనల నావహించియున్నంతవరకూ మన



మగవాళ్ళకును మనకును ననేకదుర్బుద్ధులుపుట్టును. కాబట్టి యింతటినుంచి మనపిల్లలకు చక్కగా వివాహములుచేసి సంసారులుగా నొనర్చి సుఖించండి.

పోలీసుబంట్రోతు—ప్రవేశించి యింకరా. మిమ్మల్నందరిని ఈవేళ రైలుయెక్కించాలి. (తాళముతీసుకొనిపోవును.)

---

రంగము:—[నీలాచలముయిల్లు—ప్రవేశము శ్యామసుందరరావు సాహేబువేషముతో]

శ్యామ—(తనలో) అప్పుడు చంద్రవదనకూతురుకు వెయ్యిరూపాయలుదండగపెట్టినాను. కానిమనకు నగలు అక్కడవమీచిక్కలేదు. ఈనీలాచలంవంటిమీద పదివేలరూపాయలనగలున్నాయి దీనికి యిప్పుడు పదిహేనురూపాయలు యిస్తానని చేరినానుగదా. నెమ్మదిగాదీనికి శాస్త్రసరుకు పూటుగావేయించి మెళ్లోవున్ననాలుగు తీసుకొని చక్కాపోతాను.

[నీలాచలం ప్రవేశం.]

నీలా—సాహేబుగారూ ఏమిటి ఆలోచిస్తున్నారు?

శ్యాము—ఏముండాది నీయందచందంచూచి మాకుపూరాసంతోషం వేస్తూంది. నీలాటికంచెక్ మాపుర్మేవుంటే నీపాదాల్కి బ్రిహ్మాల్ గమ్మల్ తెలగాల్ గిలగాల్ మొక్కుతార్.

నీలా—(తనలో) దిక్కుమాలిన డబ్బుకోసం యెట్టినీచకులజునితోనైనను దిరుగుచుంటినిగదా. (ప్రకాశముగా) లెక్క యిప్పిస్తారా, ముసలిది అడుగుతూవుంది.

శ్యామ—అరే మాకీ నీకీ సొమ్ముయియ్యకుండా పారిపోతాం అనుకున్నావ్ యేమిటి? పర్వానహి. అముసల్దీ కోనో భాంచోత్. పెదమనుషుల్ని యిల్లా అడుగుతుంది. ఖతల్ చేస్తాన్. నవాబ్

సాహెబ్ అనగా యేమనుకొన్నావ్?

నీలా—మాలో సాధారణంగాయెవ్వరూ సాహెబులతో స్నేహంచెయ్యరండి. యేమో మీరు గొప్పవారని నేను ఒప్పుకొన్నాను. మాకులంవాళ్లు విన్నారంటే యిదిచాలా తప్పుక్రింద భావించుతారు.

శ్యామ—మాకీ కోస్తే నెత్తుర్. మీకీకోస్తే పాలువస్తాయ్. అరే ఏమి మాట చెప్పుతావ్. మాకీ అనేకపట్టణాల్ వెళ్ళినాము. పెద్ద పెద్ద కంచెన్కు చూశామ్.

నీలా—గొప్పవారు మీకేం.

శ్యామ—ప్యారీ! జరా ఇల్లారా. మాతో కొంచం సరసంచెయ్యి. నీమీద మాకు నిండా కుషీగావుంది. నీకీ సలాంచేస్తాం.

(చెయ్యిబట్టుకొని కూర్చోపెట్టును.)

నీలా—(తనలో) దిక్కుమాలిన చేతులు తాటిబద్దలులా వున్నాయి.

శ్యామ—హేనీలాచలం! జట్టా బాంది పీవో, అమ్ లకాయే. తీన్ చార్ డ్రామ్ లగాయేతో భోత్ కుషి హోజాత్.

నీలా—మాకాట్టె అలవాటులేదండీ!

శ్యామ—పర్వానై (తాగించి) పాన్ సుపారి కాహై.

నీలా—తురకలు తమ కులలక్షణాలు పోనియ్యరుగదా. ఇది పుచ్చుకొన్నప్పటినుంచి వళ్ళు తిరుగుతూవుంది.

శ్యామ—మాకూ జట్టాసోజాతే. పూరానిషా యెక్కింది అవ్.

(నిష్క్రమింతురు.)

[తరువాత శ్యామసుందరరావు ప్రవేశించును.]

శ్యామ—ఇప్పుడు రెండుఘంటలయింది. ఇంకఆట్టే ఆలస్యంచేస్తే కొంపమునుగుతుంది. ఈముండకు పూర్తిగా కైపెక్కడంచేత నిద్రపోయింది. మెళ్లోవున్నవి అన్నీబంగారం కనపడ్డంతమట్టుకు



వలుచుకొన్నాను. ఈసాహెబు బట్టలుకూడా యిక్కడేనదిలి వేసి నెమ్మదిగా తలుపుతీసుకొని యిప్పుడు నాలుగుగంటల రైలుమీద వుడాయించుతాను. (నిష్క్రమించును.)

[నీలాచలం ఏడుస్తూ ప్రవేశించును.]

నీలా—అయ్యో! అమ్మా! అమ్మా! ఇల్లారా. దిక్కుమాలిన సాహెబు యెక్కడనుంచి వచ్చినాడే? పీనుగొంగే అయ్యో! నావస్తువులు అన్నీదోచుకొని తలకత్తిరించి మరీపోయినాడే. ఇప్పుడు పోలీసువారితో యేమని చెప్పను? సాయిబు నాయింటికివచ్చినాడని చెప్పితే మనవాళ్ళు నలుగురూ నవ్వుతారు. ఎంతో మందిని వంచించి యార్జించిన డబ్బంతా ఒక్కపూటతో పొట్టను పెట్టుకొన్నాడే. నాదేహం కుంగిపోయింది. దిక్కుమాలినవ్యభిచారంవృత్తివలన మావాళ్ళు లాభం వుందంటారు కాని కూడపెట్టినడబ్బు యిల్లాగేపోతుంది. ఛీ! దిక్కుమాలిన వ్యభిచారమా నీవింక మాకులంలోకి రాకు. ఓ నాఅక్కలారా! వ్యభిచారం పూని మనము పురుషులను వంచించి దాచిన పాపపుసొమ్ము మనకుదక్కదు. తత్కాలిక సౌఖ్యమిచ్చినా అది స్థిరమైనది కాదు. లోకానికి మనము చీడపురుగువంటివారమని లోకులనుకొనుచు మనలను అతిహేయముగ జూచుచున్నారు. కాబట్టి మనమందరము వ్యభిచారవృత్తిమాని మనపిల్లలకు వివాహములుసేయుట మంచిది. మానాభిమానములు వదలి మేళములలోకి వెళ్ళి గంతులువేయకండి. ఇది మనకు శ్రేయస్కరము. వినండి నామాట వినండి. (నిష్క్రమించును.)

---

రంగము:—[రామయ్య ప్రవేశము]

రామ—(తనలో) ఈవేశ్యలలో యేమి "యలక్ట్రిసిటీపవర్"

దీనమ్మాకడుపు కాలా ఎవర్ని చూదామన్నా కళ్ళకుకట్టుతూ
నే యుంటూంది. మొన్న ఒకసారి యేలూరువెళ్ళి ఆభోగమాళ్ల
వీధికేసి షికారు వెళ్ళేటప్పటికి దివ్యమంగళ విగ్రహంవంటి చి
న్నది ఒక్కతె కనిపించింది. ఆవేశ్యతో పొందుసల్పని జన్మ
మెందుకని తోచింది. ఎల్లాగయితేనేం నాదగ్గిర "బ్రోకరుగా
వున్న చాకలి యెల్లిగాడిద్వారా దానిపేరు గరుడాచలం అని
కనుక్కొన్నాను. దానికింకా కన్నెరికం అవకపోవడంచేతను
నకేమైనా కార్యసాధన మవుతుందేమో అని ఎల్లిగాడిని యే
లూరు పంపించాను. వాడేంచేమకొస్తాడో ఏమీ తోచకుండా
వున్నది. అయినా మాయెల్లిగాడు యెక్కడికి వెళ్ళినా కార్యా
నుకూలంచేసుకొని వస్తాడుగాని సామాన్యంగా తెల్లమొగ
ము వేసుకొని రాడు. వాడు ఈపూళ నేవస్తానన్నాడు. ఇప్పుడు
8 గంటలయింది. అదుగో కూతవినిపించింది. రైలు గోదావరి
స్టేషనుకు వచ్చింది. వాడు బహుశః ఈరైలుమీద వస్తాడు.
బహుశఃయేమిటి? తప్పకుండా నే వస్తాడు. ఆ యేలూరు
లో ఆగణికను చూచినప్పటినుంచి చిత్తమంతా చలించిపో
యింది. నిద్రలో కలలోన్ను అదే కనిపిస్తూవుంది. కలవరించినను
దానిగూర్చిన మాటలే. అందుకనే యెంతడబ్బయినాసరే యె
ల్లిగాడిని వ్యాపారంఫయిసలుచేసుకొని రమ్మని చెప్పిపంపినాను.

(వాకిట్లో—అయ్యా! రామయ్యగారూ!)

రామ—ఎల్లిగాడే వచ్చినట్లున్నాడు. ఎవరురా.

(వాకిట్లో—బాబూ! నేను ఎల్లిగాడిని)

[తలుపుతీయగా ఎల్లిగాడు ప్రవేశించును.]

రామ—ఏమిరో యెల్లిగా! నీవెప్పుడువస్తావోఅని నేను కనిపెట్టుకొని
యున్నాను. కార్యం పండా పచ్చా!



ఎల్లి—అయ్యా! నేను వెళ్ళడం కార్యం కాకపోవడం కూడానా ? ఆ
యిందిగాని కొంతకిటుకు పెట్టింది.

రామ—అదేమిటి! ఆకిటుకు ఏకిటుకుపెట్టినా కార్యసాధనం అయేట
ట్టేవుందా ?

ఎల్లి—మరేమీలేదు ఏముందిబాబూ! భోగంలంజలకు డబ్బువిష
యంలోనేగా ఏకిటుకు పెట్టినా. అంతేగా.

రామ—ఏమందేమిటి? అదియేదో త్వరగా చెప్పరా. ఏలాగో ఒకలా
గున ఫయిసలు చేదాము.

ఎల్లి—ఏంలేదుబాబూ! ఆవూరికి తమరు దయచేసి కన్నెరికమహో
త్సవంజరిగించేటట్టయితే నాలుగువందల రూపాయిలుయిమ్మం
ది. లేకపోతే అదేయిక్కడకు వచ్చేటట్టయితే అయిదువందల
రూపాయలు యిప్పిస్తేనేగాని వల్లకాదంది. ఇది వున్నమాట
తమయాజ్ఞలేందే ఎట్లు ఫయిసలుచేయడానికి మనస్సుపోక తిరి
గి వచ్చేశాను.

రామ—ఓరీ! వెధవయ్యా! ఏడవలేకపోయావు! ఈమాత్రానికి మళ్ళీ
తిరిగి రావాలా ! ఇల్లాటి వ్యాపారంలోనమ్మి హెచ్చుతగ్గులు
వస్తే నేనుమాత్రము యేమయినా అంటానా.

ఎల్లి—డబ్బుతో వ్యాపారంగనుక కాస్త ఆలోచించవద్దా బాబూ!
డబ్బయిచ్చే కామందులు మీరు, నౌఖరాడ్ని నేను, మీసెల
వులేకుండా స్వతంత్రించడానికి వల్లవున్నదా ?

రామ—ఇప్పుడయితేనేమి? నీవు తిరిగీ యీ 10 గంటల ప్యాసెంజరు
లోనే యేలూరువెళ్ళి అయిదువందలరూపాయలకు వప్పుకొని
యిక్కడకువచ్చే యేర్పాటుచెయ్యి. పైగా దానికి రాకపోకల
కు రైలుఖర్చులకు వగైరాకు ఇంకో 50 రూపాయలెక్కంటు
యెక్కువ అవవు పోని దానమ్మానిగ్గోసినడబ్బులే. మన్నిడబ్బు

సంపాదించలేదుగాని డబ్బును మనము సంపాయించగలము.

ఎల్లి—నేనిప్పుడే వెళ్ళి వ్యాపారం యెల్లాగో అల్లాగ ఫయిసలుచేస్తాను గాని నాకొక్కసందేహం పట్టుకుంది. అదియేమిటంటే మరేంలేదుగాని బాబూ అదియావూరువస్తే యెక్కడవుంచుతారు? మనయింటికి దీసుకొస్తే యింట్లో అమ్మగారు మీామొగాన్న వామొగాన్నకూడా పేడనీళ్లుచల్లరా! ఆసంగతి ఆలోచించకుండా తీసుకొనిరాఅంటే ఏమయినట్లు?

రామ—పర్వాలేదు. ఆసంగతి నేను అంతమాత్రము ఆలోచించకుండా నేవుంటానా? ఈవూళ్లో చకోరాక్షిని నాల్గురోజులదాకా దానియింట్లో గదియియ్యమంటాను. కాకపోతే పదిరూపాయలు దానికిస్తాను. అదిరాగానే ఆయింట్లో బసచేయించవచ్చును.

ఎల్లి—ఆచకోరాక్షి యెవరు? నేనుయెప్పుడూ చూడనేలేదండీ.

రామ—నీకెప్పుడు చూచినాకొత్తే. నీకు పేరుచెప్పితే తెలియదులే. మొన్న యీామధ్య షావుకార్లయింట్లో పెళ్ళికి మేళానికివచ్చినప్పుడు చేతికి "రిస్టువాచీ" (గడియారం) తగిలించుకొండే అది.

ఎల్లి—అదా బాబూ! అది దేవాంతకముండ గదియియ్యడానికి వప్పుకుంటుందో లేదో. ఆసంగతిమీారు మధ్యాన్నముగాని యిప్పుడుగాని కనుక్కోండి ఈవ్యాపారం మీారు ఫయిసలుచేసుకొంటే నేను రాత్రి మెయిలుమీాద ఏలూరువెళ్ళి అక్కడ వ్యాపారంఫయిసలుచేసుకొని వస్తాను. ఫయిసలుచేసుకొనిరావడం యేమిటి? వెంటపెట్టుకొని వస్తానన్నమాటే.

రామ—ఆలాగయితే నేను యిప్పుడేవెళ్ళి చకోరాక్షిని కనుక్కొంటానురా.

(నిష్క్రమింతురు.)

---



రంగము:—[చకోరాక్షియిల్లు—ప్రవేశము
రామయ్య—చకోరాక్షి.]

చకో—షావుకారుగారు యీావాళ మాయందు దయదలచినారు. అందుకనే మబ్బుపట్టింది.

రామ—ఆ ఏంతమాషాగాముక్కలేస్తావు. నేనుయెప్పుడూ మీాయింటికిరావడమేలేదా ?

చకో—ఇప్పుడు యెందుకువస్తారులెండి. మీారంతా పెద్దపద్దులు. మాబోటిబీదవాళ్లమీాద దయవుంటుందా యేమిటి? మీారు పిఠాపుము బాశీలనుమఱగినారు. "దూరపుకొండలు నునుపుగదా."

రామ—(తనలో) ఈకాలమున గోడలకు చెవులున్నాయి. నేను పిఠాపురందాసీకి 500 రూపాయిలుయిచ్చి కన్నెఱికం పెట్టినానని దీనికి యెలా తెలిసిందోకదా. (ప్రకాశముగా) నీమాటలకేమిలే. నీవుమాటలయందు మహాజాణవు. నీమాటలకు యెవ్వడూ జవాబుచెప్పలేడు.

చకో—దీనికేంలెండి. మీారేదో పెద్దపనివుంటేనేగాని యిలా దారితప్పిరారు. ఆపనేమిటో శాస్త్తచెప్పండి.

రామ—నేను నిజంగా నీవన్నట్లు పనివుండేవచ్చినాను. ఆపని నీవుతప్పకుండా నాయందు దయవుంచి చేస్తానంటే చెప్పుతాను. నీవు తప్పకచేస్తావనే ధైర్యముచేతనే యిల్లావచ్చినాను.

చకో—మీాకు మాయందు దయలేకపోయినా నేనుమీాపని అంటే చేయడానికి వెనక్కితీస్తానాయేమిటి? అదేమిటో చెప్పండి.

రామ—ఏమీాలేదు. రేపురాత్రికి ఇక్కడికి యేలూరునుంచి మీాహాళ్ళీ ఒకమనిషి వస్తుంది. నేనురమ్మనమని కబురుపంపించినాను. అది యీావూళ్లో నాలుగైదురోజులు వుంటుంది. ఈనాల్గురోజులూ మీాఇంటిలో ఏదైనాగది యియ్యాలి.

చకో—ఎవరండీ ఆమనిషి. ఏంపనిమీదవస్తావుం దేమిటి?

రాను—(తనలో) ఈముండ కోడుగుడ్డుకి వెంటుకలు లెక్కపెట్టుతుంది (ప్రకాశముగా) ఏమిటో నానోటితో చెప్పిద్దామని అడుగుతావుకాని ఈలాటిరహస్యాలునీకుదెలియకుంటాయా యేమిటి?

చకో—మళ్ళీ యేలూరునుంచి యెవ్వరినైనా కన్నెఱికంకోసం పిలిపిస్తున్నారా యేమిటి? అల్లాగేవుందిలెండి వ్యాపారంచూస్తే.

రామ—ఆమాట నాచేత యెందుకు చెప్పిస్తావు?

చకో—మీకేమండి మహారాజులు? పెద్దలుసంపాయించిన ఆస్తివుంది గదా! అన్నదమ్ములతో దెబ్బలాడి పంచుకొన్నారుగదా.

రామ—ఈమాటలకేమిగాని నాసంగతియేమిచేస్తావు?

చకో—మాఅమ్మను కనుక్కొంటేనేగాని ఈసంగతియెల్లా నేనుస్వతంత్రించి చెప్పగలను? ఇల్లాటిది నేనుచేశానంటే ముసలిది యేమంటుందో.

రామ—మీరు నాకు వుచితంగా యేమిపనిచెయ్యవద్దులే. మీకూనేను యేదో ముట్టచెప్పదలచుకునేవున్నాను. అదిగాకుండా నేను మీకు యింతమాత్రము వుపకారం చెయ్యలేకపోలేను. డబ్బుయిస్తేమీవాళ్ళల్లో యెవరైనా గదియిస్తారుగాని యేమో నీవు యెఱిగివున్నదానవు గనుక ఆముట్టచెప్పేది నీకే ముట్టచెప్పితే సంతోషిస్తావనే యుద్దేశంచేత వచ్చినాను.

చకో—అయినా మాఅమ్మని మీయెదరికేపిలిచి కనుక్కొంటాను. (ప్రక్కంజూచి) అమ్మా అమ్మా.

[వేశ్యమాత ప్రవేశించును]

వేశ్యమాత—ఎందుకే అమ్మాయీ! పిలిచినావు (రామయ్యనుచూచి) వీరెవరు! ఓహో రామయ్యగారా యేమిటి? ఈవేళ ఇలా దారితప్పివచ్చినారు.



చకో—అమ్మా! వీరికి మనయింట్లో నాలుగయిదు రోజులదాకా ఒకగది కావాలట. ఎవరో మనవాళ్ళే ఏలూరునుంచివచ్చినాల్గురోజులు వుండి పోతారట.

వేశ్యమా—గదులు కావలసినప్పుడు మనం కనపడుతామా యేమిటి? మనయింట్లోగది యేలాగు? రేపటిరోజునమీ చెల్లెలువరలక్ష్మివ్రతము చేసుకొంటానంటూవుంది. మనయింటికి చాలామంది మనవాళ్ళంతావస్తారు. అదికాకుండా ప్రతిగదినిండాసామానువుంది. ఎల్లాగోపాటుము పెద్దమనుష్యులువచ్చిఅడిగినప్పుడు వీలులేదనిచెప్పడానికి చాలా చింతగావుంది.

రామ—నీవు యియ్యాలని వుద్దేశంవుంటే యెల్లాగోఅల్లాగ యియ్యగలవు. నేనుమిమ్మల్ని సంతోషపెట్టుస్తానులే. మీఋణము వుంచుకోను. నీవేమీ సందేహించనక్కరలేదు.

వేశ్యమా—(రామయ్యవ్రేలియుంగరముచూచి) ఈవుంగరంక్రొత్తగా చేయించినారా యేమిటి? ఎన్నాళ్ళనుట్టో యిల్లాంవుంగరము చేయించవలసినదని మా రెండోపిల్ల చంపుకుతింటూవుంది. యెనుక ఒకరివేలుకుచూచింది. అప్పటినుంచి ఒకటేపట్టుపట్టింది. నమోనా కంసాలికి చూపిద్దామంటే దొరకకుండావుంది. ఒక్కసారి తమరైనా యిప్పిద్దురూ. కంసాలికి చూపించి మళ్ళీ యిచ్చివేస్తాను.

రామ—అల్లాగే యిస్తాను. నీవంటే అల్లా చెప్పినావు గానినేనుభయపడుతానా యేమిటి? ఇదిగోతీసుకో. నీపని అయినతరువాత మళ్ళీ యియ్యి (ఇచ్చును.)

వేశ్యమా—ఎయ్యేక, ఝగగొట్టుతా ననుకొన్నారా యేమిటి?

రామ—నీదగ్గిర యేమాటచెప్పినా తంటాగానే యుంది. సరేగానిగది సంగతి యేమిచేస్తావు?

వేశ్యమా—ఏం లేదు. గదియివ్వాలంటే మాఅమ్మాయివరలక్ష్మీవ్రతము మానమనాలి. మానమంటే అదియేమనుస్తుంది. లేకపోతే కొత్తనగ చేయిస్తున్నాను అనివచ్చిన తరువాత పెట్టుకొని వ్రతం చేస్కుందుగాని అని చెప్పాలి.

రామ—ఏదోమోస్తరుగా నీవు సర్దుచేయకతప్పదు. కాకపోతే ఈ అయిదు నవర్సులుతీసుకొని నానుచేయించి పెట్టానని చెప్పు.

(5 నవర్సులు యిచ్చును.)

వేశ్యమా—ఏమిటండి మీకు శ్రమయియ్యడం?

రామ—నాఅవసరం. అదికాకుండా మీయింట్లోఅయితే నేను యిల్లా చేసినానని రెండోకంటివాడికి తెలియకుండా వుంటుంది.

వేశ్యమా—పెద్దమనుష్యులమాట తీసెయ్యలేను. సరే మీచిత్తం ప్రకారమే చేస్తాములెండి.

రామ—సరే. ఇక నేను వెళ్ళుతాను. మళ్ళి మళ్ళి చెప్పనక్కరలేదుకదా?

వేశ్యమా—అక్కరలేదండీ.

(అందరు నిష్క్రమింతురు.)

---

[రంగము:—చకోరాక్షియిల్లు, ప్రవేశము,
గరుడాచలము, ఎల్లిగాడు.]

గరు—చూడు ఎల్లిగా! అంతదూరాన్నుంచి యింతదూరం వచ్చినాను. నాకు ఇక్కడ యేమిచిక్కులు వస్తాయో అనిభయంగాను అనుమానంగాను వుంది. అందుకుగాను నేను చెప్పమన్నమాట మీషావుకారుగారితో చెప్పినావా లేదా?

ఎల్లి—డబ్బు అంటే అయిదువందల రూపాయలు ఇప్పుడే తెమ్మన్నమాటేనా చెప్పినాను. ఆయనవిషయంలో నీవు అల్లా సందేహించనక్కరలేదమ్మా. అల్లా దగాచేసేవారు కారు. ఆయన



మనస్సుకుదిరిందా ఐదువందలకి యింకా ఐదువందలు చేర్చియిస్తారు. డబ్బుఅంటే ఆయనకు లక్ష్యంలేదు. ఇల్లాటివిఆయనకు యెన్ని అయినా అనుకొన్నావు. ఇదేకొత్తగాదు. ఇలాటి వెన్నిఖర్చులయినవో.

గరు—వారు పెద్దమనుష్యులే అయివుంటారు. అందులో సందేహమేమీ లేదుగాని అయినా ఆహారంపట్ల వ్యవహారంపట్ల మొఖమాటం వుండకూడదని చెప్పినాడు. అందుచేత అడిగినానుకాని మరోటికాదు. నీవుయింకోమోస్తరుగా ఆలోచించవద్దు.

ఎల్లి—అవునులెండి. అందుకనేఆయనతో చెప్పినాను. ఆయనయిప్పుడే డబ్బు పట్టుకొనివస్తారు. ఆయనకు డబ్బుకేంకొదవ?

గరు—నేనూ డబ్బుకోసం ఆట్టేఆలోచించలేదు. వారు చాలాగొప్పవారని మర్యాదస్తులనిన్ని యింతదూరము వచ్చినానుకాని లేకపోతే ఈమాత్రముసొమ్ము ఏలూరులో యిచ్చేవారు లేకపోలేదు.

ఎల్లి—అరుగో! ఆయనేవస్తున్నారు. ఇకమీయిష్టము.

గరు—(లేచి) దండాలండీ.

రామ—(తనలో) భగవంతుడు నాయందుండబట్టే యిట్టి దివ్యమంగళవిగ్రహం అంతదూరాన్నుంచి యింతదూరంవచ్చే భాగ్యం లభించింది. వెధవడబ్బు పోతేనేంగాక. ఆహా! దీనిమొగం చూస్తే చంద్రవదనయనుపదమునిఘంటువులో వేసికవీశ్వరులు గ్రంథాలలో వాడడం మొదలుపెట్టినారనితోస్తుంది. దీనిపళ్ళు బ్రహ్మదేవుడు వజ్రాలతో చేసినాడుకాబోలు. నవ్వితే మొహారీలు రాల్తాయి. (సమీపించుచున్నాడు.)

గరు—ఇల్లా దయచేయండి.

రామ—నీవు మావూరుకు వచ్చినప్పుడు మేమునిన్ను మర్యాదచేయ్యాలి. నిన్ను మర్యాదచెయ్యడానికి తగినట్టియిల్లుదొరక నేలేదు. ఎల్లాగయితేనేం కష్టముమీద యీచకోరాక్షీ పాపము నాయందున్న విలువచేత యీయిల్లు యిచ్చింది.

గరు—మీరునాయందున్న ప్రేమచేతఅల్లాచేస్తారుగాని, నేనంతమర్యాదకుదగినదాన్నా. మీలాటివారిదయ సంపాదించుకొనిజీవించవలసినదాన్ని.

రామ—నీవల్లాగ చెప్తావుగాని, నీయొక్క అందమే నాబోటివాళ్ళను ననేకమందినీకు దాసానుదాసులుగా చేస్తుంది. నీదగ్గిరవున్న సౌందర్యముచేతనేకాదూ నిన్నునేను యేలూరు నుంచి రప్పించాను.

గరు—నాయందుమీకు దయవుండడంచేత.

రామ—నీకు కావలసినదందా యీయెల్లిగాడుసప్లయిచేసినాడా? ఎల్లిగాడు బజారు వెళ్ళిరాలేదా?

ఎల్లి—వెళ్ళలేదు. బాబూ వెళ్ళుదామనుకొంటూవుంటే యింతట్లోకి మీరువచ్చినారు.

రామ—అల్లాగయితే నీవుబజారుకు తొందరగావెళ్ళిరా. పాపమువీళ్ళకు భోజనానికి పొద్దెక్కగలదు.

గరు—పరవాలేదులెండి. పొద్దున్నే మాతమ్ముడు కాఫీహోటలుకు వెళ్ళిఉపమాయిడ్లెన్లూ కాఫీ తెచ్చినాడు. అవిపుచ్చుకొన్నాము

రామ—ఒరే. యెల్లిగా. బజారునుంచి ఏంకూరలు పట్టుకొనివస్తావు?

ఎల్లి—ఏంపట్టుకురమ్మనిసెలవిస్తే అవిపట్టుకొని వస్తాను.

రామ—గరుడాచలాన్ని కనుక్కో. వాళ్ళకు యేమియిష్టమో,

గరు—ఏవయినా సరేనండి. మీకాయిష్టంవచ్చినవి తెప్పించండి.



రామ—ఓరేచూడు. ఒకవీశెడు బంగాళాదుంపలు. ముప్పావలా అవుతాయి. తరువాత పెద్దచిక్కుడుకాయలు ఒకవీశెడు. అర్ధరూపాయి యిస్తున్నారు. దోసకాయలుపదలం. బియ్యంవున్నాయే సన్నబియ్యం అనిచెప్పు లేకపోతే ఢిల్లీభోగాలంటే తెలుస్తుంది. రూపాయికి 3 శేర్లన్నర యిస్తారు. అవి రెండురూపాయలవి పట్టుకొనిరా.

ఎల్లి—బాబూ. మనయింటికాడకూడా కూరలు బియ్యం అయిపోయినాయని చెప్పినారు.

రామ—యింట్లోకూడా అయిపోయినాయా. సరే. అల్లాగయితే మన మామూలుకొట్టుదగ్గరకు వెళ్ళితే అక్కుళ్ళుబియ్యం రెండురూపాయలవి తీసుకొనిరా. జాగ్రత్తగా కొలిపించుకో 16 శేర్లు యిస్తాడు. ఇంకకూరలు చౌకగాచూచి బజ్జివంకాయలు, ఒకపొట్లకాయ కానీయిస్తేవస్తుంది. ఒకడబ్బు తోటకూరకూడా తీసుకో ఒకడబ్బు పచ్చిమిర్పకాయలు కొత్తిమీరి కలిపిపుచ్చుకో. తెలిసిందా వెధవా మఱచిపోయేవు. జాగ్రత్తగా పట్టుకొనిరా. పో.

9754

ఎల్లి—చిత్తం. (నిష్క్రమించును)

[మాధవుడు ప్రవేశము.]

మాధ—ఏమే. అక్కయ్యా. ఇంకా యిల్లాగేకూర్చున్నావు. వంటప్రయత్నం ఏమీ లేదా యేమిటి?

గరు—అప్పుడే నీకాకలివేస్తూవుందా. ఇప్పుడేకాదంటూ కాఫీతాగింది.

రామ—మీతమ్ముడా యేమిటి?

గరు—అవునండీ. నాతోకూడావచ్చినాడు. (మాధవునిజూచి) వీడను స్నేహితులతో మాట్లాడేటప్పుడు అల్లరిచెయ్యకు. వీరెవరనుకొన్నావు. ఈయనే మనలను యిక్కడకు పిలిపించింది.



మాధ—అల్లానా బావగారూ దండాలు. మాబావగారన్న సంగతి నాకు తెలియలేదండీ. (యించుక యూరకుండి) ఏమండీ బావగారూ. మీవూరువస్తే యేమీ తోచడమే లేదు.

రామ—మీవూరుకంటె మావూరు బాగావుంటుందే. కాఫీతాగివచ్చి నాల్గుబజారులు షికారులుకొట్టిరాకపోయావూ?

మాధ—బజార్లు షికార్లుకొట్టడం అంటే సామాన్యంగావుందా. ఏమన్నా నాలుగుడబ్బులు వుండాలా లేదా? మాకెక్కడనుంచి వస్తాయి. పోనీ కొండంతషావుకార్లు? యిక్కడకు మమ్మల్నిపిలిపించారు. ఈవెధవకు యేమయినా ఖర్చుకిచ్చరుగనుకనా?

గరు—షావుకారుగారు నీకిప్పిడే యియ్యనివేళ అయిందిరా.

మాధ—ఎప్పుడో యిస్తారంటావు. అడిగితే యిప్పుడు లేదుగాని అడగందే ఎప్పుడో యిస్తారంటావు "పగలుచేతితో పిలిస్తే లేదుగాని రాత్రికనుసైగచేశాడట" నువ్వుచెప్పినమాట అల్లావుంది.

గరు—ఏడిశావు. నీవుమాటలు మానేర్చావు.

మాధ—మాబావగారి జేబులో యేముందో. (జేబులో చెయిపెట్టబోవును)

గరు—ఒరే. ఏమిటాసాహసము. జేబుల్లోచేయిపెడ్తావు. యేమనుకొన్నావేమిటి? వారిజేబులు యెప్పుడూ నోట్లతోను నవర్సులతో నునిగడివుంటాయి. యేమన్నా పోతుందంటే నిన్నూ నన్నుగూడా స్టేషన్కులాకెళ్ళుతారు.

రామ—మరేంపర్వాలేదు. ఇంతమాత్రానికే. జేబుల్లోవుంటేమాత్రము. ఈజేబులోవుండేదంతా మీకోసమే.

గరు—జేబులోవుండేదంతా మాకోసమే అయితే మాయింటికి బంగారపుగోడలే పెట్టుతాము.



రామ—నేను అబద్ధంచెప్పలేను. ఇదిగో. 34 నవర్సులు తెచ్చినాను. తీసుకో. ఎప్పుడయితేనేం నీకియ్యవలసినవేగా. డబ్బుతెస్తేనా చుకోవడం కష్టమేమోయని కాసులుతెచ్చినాను. (కాసులుయిచ్చును.)

గరు—(పుచ్చుకొనును)

మాధ—బావగారూ. బజారుఖర్చుకు నాకేమయినా యిప్పించరూ.

రామ—ఇదిగో యీఅయిదురూపాయలు పట్టుకొనివెళ్లి నీయిష్టమైన ఖర్చుచేసుకో. (యియ్యబోవును)

మాధ—ఇదేనా. ఇదినాకెందుకూ?

గరు—ఇచ్చిందియేదో ముందుపుచ్చుకో.

మాధ—(పుచ్చుకొని) ఈవాళా రేపు యెల్లుండి కాఫీకియెవర్నీ ముష్టెత్తనవసరంలేదు. (ఇంచుక యూరకుండి) షావుకారుబావగారూ ఈవూళ్లో పట్టుబట్టలునేసే మరలు మహావున్నాయట. ఎవరివంటిమీద చూచిన పట్టువుత్తర్వులే. తినడానికికూడు వున్నా లేకపోయినా నెలకుపదిరూపాయలు జీతమయినాసరే ఒకనెలలో పస్తుపడుకున్నాసరే లేకపోతే పెళ్ళామువుస్తె తెగనమ్మయినాసరే ఒకపట్టువుత్తరీయం వేసుకొనేవాళ్ళున్నారు. అల్లాటప్పుడు మీవూరువచ్చినందుకు నాకుఒకపట్టుఖండ్వాకొనిపెట్టండి. మీపేరు యెప్పుడూ చెప్పుకుంటాను.

గరు—నీకు పట్టుఖండ్వామీద మనస్సుపోయింది. అదిసామాన్యపుఖరీదనుకొన్నావాయేమిటి? 15 రూపాయలు అవుతుంది

మాధ—షావుకారుగారికి కొనిపెట్టాలంటే వారురోజూవాడేసిగరెట్టు ఖర్చుకంత ఖరీదైనాలేదు. వారిదయవస్తేసరి. ఏమండీ బావగారు అంతేకాదూ.

రామ—నిజంగా నీకుపట్టుఖండ్వా వేసుకోవాలనివుందా. అలాగయితే

నీవుమధ్యాహ్నం భోంచేసి మాకొట్టుదగ్గిరకురా. యిల్లులోకితీసు
కొనివెళ్ళి నీకుకావలసిన ఖండ్వా యిప్పించెదను.

మాధ— చిత్తము.

రామ— గరుడాచలం. ఇంకనాకూకాస్త కొట్టుదగ్గిర పనివుంది. నీకూ
వంటకు పొద్దెక్కుతూవుంది. కాబట్టినేనువెళ్ళి సాయంకాలం
పెంద్రికాళె భోంచేసుకొని యిక్కడకువస్తాను.

గరు— చెప్పడం మఱచిపోయినాను. మీయెల్లిగాడు నాతో మూడు
కొత్తచీరెలు పంపిస్తారని చెప్పినాడే. అవియేవి?

రామ— మూడుచీరెలు కావాలీ ?

గరు— తమబోటివాళ్లు యియ్యకపోతే మరెవరుయిస్తారు ? నేను యే
లూరుకువెళ్ళితే మావాళ్ళందఱూ అంతదూరంవెళ్లి యేంతె
చ్చావు. షావుకారుగారు యేంబహుమతీచేశారంటే యేంచెప్ప
మన్నారు. తెల్లమొగంవేసుకొని చూస్తే నలుగురూ నవ్వరా?
యేమిటి? పోనియ్యండిమీగొప్పవుంచుకోడానికన్నా నన్ను స
న్మానించవద్దూ.

రామ— పోని. ఇంతేకదా. ఇందులోనాకు పోయిందేమిటి? అల్లాగే ఎ
ల్లిగాడిచేతికిచ్చి మంచివిజగీచీరలు మూడుపంపుతాను. ఇంకనా
కు పొద్దుపోతూవుంది వెళ్ళుతాను.

గరు— వూరుకొన్నావా రూరుకోక నూతమ్ముడికి కుట్టుఖండ్వాకొనిపె
ట్టానన్నారు. ఇంక అస్తమానం వాడునన్ను అదే అడుగుతూ
వుంటాడు. మీతోవాడిని యిప్పుడు పంపమన్నారా లేకపోతే
భోంచేసి పంపమన్నారా.

రామ— ఇప్పుడు నేనుకొట్టుదగ్గిరకు వెళ్ళుతాను. మధ్యాన్నంయెల్లిగా
డితో మాకొట్టుదగ్గిరకుపంపు. వాడికికావలసిందికొనిపెట్టాను.

(అందఱు నిష్క్రమింతురు.)



రంగము:— రామయ్య. యిల్లుప్రవేశము;—

రామయ్యభార్యయగు, కామమ్మ ప్రవేశము.

కామ— (తనలో) నేను కాపరానికి వచ్చిందిమొదలు యీయనఒకనా
డైనాయింటివద్దబడుకున్నపాపాన్ని పోలేదుకదా. అస్తమానం
యేకబోగంవాళ్లు. వాళ్లంటేపడిచస్తారు. ఈబోగంవాళ్లకోసం
ఎప్పుడుచూచినా యేలూరు, పిఠాపురం, మొదలయినవూళ్లకి
వెళ్లివస్తూఉండడంగూడా సాగించినారు. ఇంక యీకాపురం
బాగుపడేదియెల్లాగు? ఈవాళమట్టుకు యీవాళయెవర్తో బో
గందాన్ని ఏలూరునుంచి పిలిపించినారట. నాల్గురోజులు ఈవూ
ళ్లోవుండడానికిన్నీ, ఈయన దానికి 500 రూపాయిలు యియ్య
డానికిన్నీ వప్పుకొన్నారట. అయ్యో, డబ్బంతా యిల్లాగే
పొయ్యిలో పోసేస్తున్నారు. పోసినాకేమని వూరుకొందామం
టే చూస్తూచూస్తూ వూరుకోవడం యెల్లాగు. కానీ, ఈ రా
త్రి ఈయన ఏలూరు బోగందానింటికి వెళ్లుతారట. ఎల్లాగయి
నా దానికి విఘాతం కలిగించాలి. అయ్యో ! ఈయన కార్యా
నికి నేను విఘాతం కలిగిస్తే రాత్రికినాయుడు నాయింటికిరావ
డానికెల్లా వీలుంటుంది. పోసి. ఈవాళ ఒక్కరోజు రాకపోతే
నేం. నేను మూర్ఛలు వచ్చేదానికిమల్లేనటిస్తాను. దానితో ఆ
యన ఖంగారెత్తి యెక్కడకు కదలకుండా వూరుకొంటారు.
ఏమయినా సరే. యిల్లాచేస్తాను.

[ఎల్లిగాడు ప్రవేశము.]

ఎల్లి— యివిగోనండమ్మా. కూరలు తెచ్చాను.

కామ— అబ్బా! ఏమికూరలురా. నాకువంట్లో చాలాసుస్తీగావుంది.
వళ్లంతా తిరుగుతూవుంది. మీకామందుగారిని త్వరగా యిం
టికివచ్చి వంటచేసుక్కోమనిచెప్పు. నేనువంటవండలేను. నీవుతె

ష్చిన వస్త్రాలన్నీ అక్కడపడెయ్యి. సర్దడానికన్నా శక్తిలేదు. నీవు త్వరగావెళ్లి షావుకారుగారిని పిలుచుకొనిరా!

ఎల్లి—చిత్తంఅమ్మా. (నిష్క్రమించును.)

కామ—(తనలో) కానీ. ఏమయితేఅయింది. రానీ ఆయన్ని ముప్పుతిప్పలుపెట్టి మూడుచెర్వులనీరు తాగిస్తాను.

(పడుకొనును)

———

[రామయ్య—ప్రవేశించును.]

రామ—(భార్యనుచూచి) ఏమే! యింకామడికట్టుకోలేదు. వంటప్రారంభించడానికి యింకా వేళకాలేదనుకొన్నావా యేమిటి?

కామ—అయ్యో! నన్నుమాట్లాడించకండి. నావళ్ళంతా తిరుగుతూవున్నట్లున్నది. గుండెలలోదడగావుంది. నేనువంటచేయలేను. పోనియ్యండి ఈపూటకుయెవళ్ళనయినా పిల్చుకొనివచ్చి వంటచేయిస్తురూ. ఏదో ఈపూటకు ఒకపావలా యియ్యవచ్చును.

రామ—ఇంతప్రొద్దెక్కిన తరువాత యెవరువస్తారు? పోనీలే. నేనేకాసినినీళ్ళు పోసికొని ఏదో అత్తిసరు పడవేస్తాను.

కామ—ఏదోఒకటి కానియ్యండి త్వరగాను. వళ్ళుతిరుగుతూవుంది. అమ్మా. అయ్యో. ఊఊ. (మూలుగుచున్నది.)

రామ—(త్వరలో) తీరాదీనికి మంచిసమయానికేసుస్తీ చేసింది. ఈరాత్రికూడా గరుడాచలం దగ్గిరకువస్తానని అయిదువందల రూపాయిలుకూడా యిచ్చినాను. దీనిసుస్తీ నాకార్యానికేమి యంతరాయంగలిగిస్తుందో.

కామ—అయ్యో! అదోమాయంగావుందండీ. (మూర్ఛపోవుచున్నది)

రామ—యిదేక్కడిఅవస్థ యెప్పుడేంచెయ్యను! ఒరేఎల్లిగా నీవుఒకసారివెళ్ళి డాక్టరుగారిని నేనుచెప్పినానులని చెప్పితీసుకురా.



నేను నెమ్మదిగా దీనిని యిక్కడనుంచి గదిలోనికి తీసుకొనివెళ్ళి పడుకోపెట్టాను.

(నిష్క్రమించును)

[రంగము—గరుడాచలం—ఎల్లిగాడు]

గరు—ఏమి మళ్ళీయిప్పుడింతతొందరగావచ్చావుయేమిటి?

ఎల్లి—ఏంలేదు. ఒకగొప్పవిఘాతంవచ్చింది. రామయ్యగారి భార్యకు చాలా జబ్బుచేసింది. రెండుమూడురోజులదాకా తీరుబడినుండదు, అందుచేత మిమ్మల్ని నాల్గురోజులదాకా వుండమన్నారు. ఈలోపుగా మీకుఅయ్యేఖర్చంతా పెట్టామన్నారు.

గరు—బాగానేవుంది. పొరుగూరువచ్చి యిన్నాళ్ళు ఒకరింట్లోవుంటే యేంబాగావుంటుంది? తీరాఆయనదగ్గిరనుంచిడబ్బుకూడాముందేపుచ్చుకున్నాను. యిప్పుడిచ్చేస్తే ఏంబాగావుంటుంది. పోనియిచ్చేసి మరొకప్పుడు ఆయన యెప్పుడురమ్మంటే అప్పుడువస్తానని చెప్పితే ఏమనుకొంటారో.

ఎల్లి—మీకేం పర్వాలేదు. నేను చకోరాక్షితో మాట్లాడినాను. మీరెన్నాళ్ళయినా వుండవచ్చును. ఆలస్యమైనందుకు మీరామాత్రములాభము ఆయనవల్ల పొందకపోరు. హఠాత్తుగా ఆయనపెళ్ళానికి జబ్బుచేస్తుందని యెవరైనా అనుకొన్నారా! మీకేంభయంలేదువుండండి. మీకయ్యేఖర్చులన్నీ ఆయన భరాయిస్తుంటె మీకు సందేహంయెందుకు?

గరు—సరే. యిప్పుడాలోచిస్తే యేమవుతుంది. మావాళ్ళకు యీవాళ వుత్తరమువ్రాస్తాను. లేకపోతే వాళ్ళు బెంగపెట్టుకుంటారు. పోస్టాఫీసుకు వెళ్ళి కవరుఒకటి తెచ్చిపెట్టు.

ఎల్లి—మంచిది. (నిష్క్రమించును.)

[చకోరాక్షితల్లియగు వేశ్యమాత ప్రవేశించును.]

వేశ్యమాత—ఏం అమ్మాయి. ఏదో ఆలోచిస్తున్నావు. పాపము అనుకొన్న దానికి భంగమయిందికదా. ఈవాళవద్దామని షావుకారుగారు మహాసంతోషంపడ్డారు. అయితేనేంగాక పాపమాయన పెళ్ళానికి హఠాత్తుగా మూర్ఛలరోగం పుట్టింది.

గరు—అవునట పెద్దమ్మా! ఆయననౌఖరు యెల్లిగాడు యిప్పుడే చెప్పినాడు.

వేశ్యమాత—పోనీలే. యిప్పుడు మించిపోయిందేమున్నది? మీస్వంతయింట్లో యేలావున్నవో యిక్కడా అల్లాగేవుండు. నీకేమీ అభ్యంతరములేదు. ఈవాళనుంచి వంటకూడానువ్వుచేసికోకు. మాతోపాటు నువ్వూ మీతమ్ముడూ భోంచేతురుగాని. ఏమిటో మళ్లీనువ్వు చెయ్యికాల్చుకొనేది యేమిటి?

గరు—పాపము మీకు శ్రమయియ్యడంయెందుకు?

వేశ్యమా—మాకు శ్రమయేమిటి? నువ్వేమి పరాయిదానవాయేమిటి. మాకు బంధుకోటిలోదానవే. నీవాసందేహం యేమీ పెట్టుకోవద్దు.

గరు—నువ్వుఅల్లాచెప్పుతూవుంటే నీమాటవల్ల కాదనడం నాకు యేమిబాగుంటుంది. నీయిష్టప్రకారమే చేస్తాను.

వేశ్యమా—ఈసంగతి అల్లావుంచు, నీకింకోసంగతిచెస్తాను. అదినీవురహస్యంగా దాచాలి. ఎందుచేతనంటే నీవుచిన్నదానవు. యింకానీకు మనవ్యక్తియంకు అనుభవంగాలేదు, నీవు మీవూరునుంచి పొరుగూరువచ్చినావా వెళ్లేటప్పుడు నాల్గుడబ్బులు సంపాయించుకొని పోవాలిగానివూరికేవెళ్లితేఆట్టేగొప్పకాదు.

గరు—డబ్బుకోసమేకాదూ పెద్దమ్మా. ఈషావుకారు కబురంపితే వచ్చింది.



వేశ్యమా—ఈసంగతిసరేలే. షావుకారు యివతలకు రావడానికి రెండుమూడురోజులు పట్టుతుంది. ఆయనభార్యకు నెమ్మదిగావుండాలా. అంతవరకు నీవు ఆయన పంపించేది వూరికేతింటూకూర్చుంటే యేమిలాభమువుంది?

గరు—ఏంచెయ్యమన్నావు?

వేశ్యమా—ఏంచెయ్యమన్నావని నన్ను అడుగుతున్నావూ. యిం[illegible]త్రింనీవు గ్రహించుకోలేవు. నేనుచెప్పాలి. పొద్దున్న మాయింటికివచ్చినఆయన్ని చూచావా. ఆయన ఒకనాయుడులే. చాలా గొప్పవాడు. మాయిల్లుఆయనకు తాకట్టువుంచి ఒకవేయిరూపాయీలు అప్పుతెచ్చుకొన్నాము.

గరు—ఆయనమొగంచూస్తేనే భాగ్యవంతుడని తోస్తూవుంది.

వేశ్యమా—ఆయనకంట నీవుపడ్డావు. దానితో ఆయనచిత్తం చలించిపోయింది. ఈవిషయంలోఆయననాతోమాట్లాడితే, ఈపిల్లకు యింకాకన్నెఅకంకాలేదు. ఈవూళ్ళో ఒకషావుకారుగారు పిలిపించినారు అనిచెప్పినాను. చెప్పితేనేమి ఆయననాకదంతోపనికిరాదు ఎంతడబ్బుకావలస్తే అంతడబ్బుయిస్తాను అని నన్ను కనుక్కోమని బలవంతపెట్టే పెద్దదాన్నిగనుక నామాటనీవుత్రోసివెయ్యవని నూటపదహార్లుయిస్తే ఆలోచిస్తానని చెప్పినాను అందుకు ఆయనవప్పుకొన్నాడు. నేను మీతల్లివంటిదానిని, కాబట్టి నీవుయిందుకు వప్పుకో. (రామయ్యషావుకారుగారు యీవాళరారు.

గరు—రామయ్యగారు విన్నారంటే, యీలాటి దగాముండఅని నిందించరా.

వేశ్యమా—ఆయనకు తెలుస్తుందిగనుకనా. ఆభయమేమీ నీకు అవసరంలేదు.

గరు—నీవు నామంచికోసమనుకున్నా, నాకుడబ్బురావాలనివుద్దేశ్యంతో
చెప్పుతూవున్నప్పుడు నీమాట తీసివేస్తే యేంబాగావుంటుంది ?

వేశ్యమా—మనలో యిదిమామూలే కన్నెరికంలంటేగాని ఎక్కువ
డబ్బురాదుగనుక యప్పటికప్పుడే మాపిల్లకింకా కన్నెరికం
కాలేదు అని వంకపెట్టుతూవుండడం మనలో ఆచారమే. నీవు
ఆవిషయం సందేహించవద్దు (తనలో) దీనిని యెల్లాగయినా
ఆనాయుడికిగూర్చి, అతనిదగ్గిరవున్న యింటితనఖాదస్తావేజు లా
క్కోవాలి. ఇదేమంచిసమయం.

గరు—(తనలో) పోని వూరికేపోనియ్యడం యెందుకునూరురూపాయి
లు. వూరికేకూర్చుంటే వస్తాయా. ఆరామయ్యగారు ఈవాళ
రారుగదా (ప్రకాశముగా) పెద్దమ్మా నీమాటకాదనలేను.

వేశ్యమా—సరే అల్లాగయితే నాయుడుగారిని రాత్రికిరమ్మని కబురు
పంపుతాను. రా.

(నిష్క్రమించును.)

---

రంగము:—[ఒంటరిగా రామయ్య ప్రవేశము.]

రామ—(తనలో) అన్నా! ఈవేశ్యలనునమ్మగూడదు. ఎంతధనమిచ్చి
నావీళ్ళకు సంతృప్తియనుమాట కడుపులో కంచుకాగడాపెట్టి
చూచిననుగాని కనుపించదు. నేను మహాశ్రమపడి ఏలూరు
నుంచి ఆగరుడాచలాన్ని కన్నెరికంకోసం పిలిపిస్తే ఆముండ
యెంత మాదర్చోదీపనిచేసింది. ఎవడోనాయుడువస్తేవాడిదగ్గిర
వందరూపాయిలు పుచ్చుకొందట. ఆలోచించగా ఇది దీని
బుట్టినబుద్ధిలాలేదు. ఆచకోరాక్షితల్లి యిది అంతాచేసింది
ఆముసలిముండ ఆనాయుడుకు ఏమో డబ్బు యియ్యవలెనట
దీన్నికూడుస్తే ఆఅప్పు అడగడం మానేస్తాడుగదా అనియిల్లా



చేసింది. ఒకవేళ ఆముసల్ది బోధిస్తేమాత్రము యిది యిల్లా చే
యాలి. గానీ మించిపోయింది. నీకూ అది వెళ్ళినతరువాత తె
లిసింది. ఒకవేళ వున్నప్పుడు తెలిసినా యేమిచేస్తాను? వలపు
కొద్దీ 500 రూపాయిలూ ముందు యిచ్చివేశానుగదా. ఆహా!
ఈవేశ్యలు యెంతకయినను జాలుదురు. సుజ్ఞానులయిన వారు
వీళ్ళ జాతిలక్షణాలు కనిపెట్టే వీళ్ళపొందు రోతయనిశాస్త్రము
లలో చెప్పినారు. ఛీ! ఎంతధనమిస్తేనేమి? కుక్కని తీసుకొనివ
చ్చి సింహాసనంమీద కూర్చోపెట్టితేమాత్రం దాని గుణము
అది వదలుతుందా.

సీ. మాయమంత్రములన్ని ॥ పతితగుణాఢ్యుల
విటకాంత్రిగాజేసి ॥ వెలయుచుండ్రి
పటురాగమునుజూపి ॥ విటకాండ్రవలపించి
ధనమునెంతైన గై ॥ కొనుచునుండ్రి
వలపమందులఁబెట్టి ॥ భర్తలు సతులను
విడనాడగాజేసి ॥ వెలయుచుండ్రి
కపటంబు ప్రేమంబు ॥ కల్పించిజారుల
సేవకుల కరణిని ॥ జేయుచుండ్రి
నిదియు నదియంచు ॥ మదినినెన్నఁ
దరముకావట్టి నృత్యముల్ ॥ ధరణియందు
సలుపగాజాలుదురు వెల ॥ సతులు; వారి
వలచి, చెలగెడిపురుషుల ॥ బ్రతుకురోత.

తే. గీ. ధనము నిచ్చినవాడెపో ॥ ధవుడటంచు
వలపు జూపించుచుండెడి ॥ వనితకెట్లు
మదిని ననురాగమేరీతి ॥ గుదిరియుండు
తృప్తియనుమాట నెట్లులు ॥ తెలియగలదు.

సీ. వ్యభిచారవృత్తి జీవనముగా భావించి
ధర్మమార్గము వీడి తనరుచుండ్రు
వరుస వావులు లేక పశువర్తనము దాల్చి
కుంటిగ్రుడ్డియనక గూడుచుండ్రు
వేళపాళలు లేక విత్తమిచ్చినవాడి
ధవుడంచు వానితో దనరుచుండ్రు
ద్రవ్యంబు నాసించి తగనికార్యములెన్ని
యైనను గావించి యలరుచుండ్రు

తే. గీ. కరుణ యన్నది యావంత గానలేము
ప్రేమ యన్నది పూజ్యమై వెలయుచుండు
అమిత మాయగుణంబుల కాటపట్టు
వారసతుల జేరెడివారి బ్రతుకు రోత.

సీ. ముసిముసినవ్వులన్ మోహమందగ నెమ్మొ
గము వంచి యొకని గ్రేగంట జూచు
కనులు చిట్లించుచు గమసియుమా పైట
జారించి యొకనిని సైగ జేయు
చిలుకపల్కులగతి లలితమౌ ముద్దు
మాటల నొక్కని మరలుగొలుపు
గబ్బిగుబ్బల జూచి యుబ్బి తబ్బిబ్బులౌ
డగ నొక్కరునకు కవుగలి నొసంగు

తే. గీ. యొకనితో ముచ్చటలు సల్పు నొకని జేరు
యొకని ముద్దిడుచుండు వేరొకని గొట్టు
మోహనాస్త్రంబు భంగిని ముగుద; విటుల
హృదయ ధనముల నింతలో నెమ్మిగొనును.

ఛీ! ఇట్టి వారాంగనలను చేరుట పరమ అసహ్యకరము. ధనగర్వమ



చేత కన్నును మిన్నును తెలియక మొదటవున్న డబ్బంతా తగ
లేశాను. ఎంతడబ్బిస్తే యేమిలాభంవుంది. ఇంకనైనా బుద్ధి తెచ్చు
[illegible] జాగ్రత్తగా వుండాలి. వేశ్యలపొందు నేనేగాక యెవ్వరు
[illegible]కుండా వుందురుగాక.

చ. [illegible]సవు బ్రతిష్ఠలన్నియును బాయును; ద్రవ్యము గూర్చుకొంటకై
తలుచగుచుండు యోచనలు దగ్గరబంధువు లేరురారు సో
దరులును దిట్టుచుండెదరు దల్లియు దండ్రియు లోనగుందు; సుం
దరియు ననేకభంగులను దైన్యము నొందును చిత్తమందునన్॥

(నిష్క్రమించును.)

---

రంగము:—[సింహాచలము, చంద్రవదన.]

చంద్ర—అమ్మాయీ! మనకు మంచి అండ అయిన వెంకటాద్రియ్య గారు పరమపదించారుగదా. పాపము.

సింహా—అమ్మా! మన జాతిలక్షణం చేత ఆయన వున్నప్పుడు వాళ్ళతో వీళ్ళతోను తిరిగేదాన్ని గాని ఆయన నామీద చూపించే ప్రేమ తలచుకొంటే నిజంగా యేడుపువస్తుంది. ప్రపంచకంలో వేశ్యలను వుంచుకొన్న వాళ్ళు ఆయన పెట్టినంత డబ్బు యెవ్వరు పెట్టినారు! నిజంగా యిప్పుడు మనదగ్గర నిలవవున్న డబ్బు ఆయన వల్ల గణించిందేగదా.

చంద్ర—అవునమ్మా! ఇంక నీకు సహస్రజన్మాలు యెత్తినా అల్లాటి అండ దొరకదు. జరిగిపోయిందానికి విచారిస్తే యేమిలాభంవుంది. ఎల్లాగో మనకులవృత్తి మనకు దప్పదు. వూరుకుంటే యేంలాభమువుంది. కాని సింహాచలమూ అన్నీ బాగానే వున్నాయి గాని, మీ అక్కయ్య చేసేపని మాత్రం యేమీ బాగా లేదు.

వుంచుకొన్నాయన యెంతో డబ్బు యిస్తున్నాడు. చాలాసంపా
యిస్తూవుంది. కాని యేంలాభము? నిలబెట్టుకోలేదు. ఆకృష్ణ
మూర్తి దానికి షోకేలీ భర్తయై వున్నాడు. ఇదిసంపాయించి
నడబ్బల్లా అతనిచేతులో పెట్టుతూవుంది. అతడు లేకపోతే ఒక
నిమిషమయినావుండలేదు. అతడుబాగా దీనిని గొఱుగుతున్నా
డు. పోనీలే. ఏంచేస్తాము?

[రామన్న ప్రవేశించును.]

చంద్రి—ఏంరామన్నా! ఏదోపనిమీద వచ్చినావు. వూరికేయెప్పు
డూ వచ్చేవాడవుగావు.

రామ—(తనలో) వెనుక హైదరాబాదు జాగీరుదారుని యిచ్చటికితీ
సుకొనివచ్చినప్పుడు ఐదువందల రూపాయిలు లాభంగలిగింది.
ఈసింహాచలానికిగూడా ఆధర తగ్గిపోయింది. వెంకటాద్రియ్య
గారు చావగానే యీవితగ్గింది. (ప్రకాశముగా) ఏముంది. పా
పము. మీకుమంచి అండపడిపోయిందిగదా.

చంద్రి—అవును. ఏమిచేస్తాము. ఎంతప్రాప్తోఅంతే. ఇప్పుడునువ్వువ
చ్చినపని యేమిటో కాస్తచెప్పుదూ?

రామ—ఏముంది విశేషము. చిత్తూరునుంచి నరసింహంగారని ఒక
ఆయన వచ్చినాడు. నెమ్మదిగాఆయన్ని యిక్కడకుయీరాత్రి
వచ్చేయేర్పాటు చేదామనే వుద్దేశంవుంది మిమ్మల్ని కనుక్కొం
దామని వచ్చినాను.

చంద్రి—ఏమిటో! ఈలాటి స్వల్పముల జోలికిపోవడం యెందుకు ?

రామ—స్వల్పాలుకాకపోతే కాలము యెప్పుడూ ఒక్కమోస్తరుగా
వుంటుందేమిటి? ఆవందలు వేలు వెంకటాద్రియ్యగారితోనే
పోయింది. ఇప్పుడు మళ్ళీ రూకలు వుంతలోకి అనగా 4-8



లోపడ్డది. ఎల్లాగయితేనేమి కులవృత్తిగదా. చిల్లరశివాలక్ష్మి
అన్నారు. ఎప్పుడూఒకటే నీమం పెట్టుకొనికూర్చుంటేయెల్లాగ?

సింహా—సరేగాని రామన్నా, నీయిష్టంవచ్చినట్లు యేర్పాటుచేయవ
చ్చునుగాని, నిన్నొకసంగతి అడుగుతాను, కోపంరామగదా,
నిజంచెప్తావా?

రామ—బుర్రపోయినా కోపంరాదు. ఒకరి ప్రాణంపోయినా అబద్ధ
మాడను.

సింహా—వెనుక తీసుకొనివచ్చిన జాగీరుదారు మాఅమ్మకియ్యమని
నీకు యెంత యిచ్చినాడు ?

రామ—అయిదువందలేకా. మీఅమ్మకే అయిదునోట్లూయిచ్చేశాను.
ఏమన్నా యెక్కువ యిచ్చానన్నాడాయేమిటి?

సింహా—నిజంగా వేయిరూపాయిలు యిచ్చినానన్నాడులే.

రామ—దొంగనాకొడుకూ, అల్లాఅన్నాడూ. ఇన్నాళ్ళనుండి మీయిం
టికి వచ్చిపోతూవుంటాను. ఎప్పుడైనా యేవ్యాపారంలోఐనా
తేడావచ్చిందా. కావాలంటే మిమ్మల్ని అడిగిపుచ్చుకొంటాను
గాని దొంగపని నాకెందుకూ? మీరెప్పుడూ నావిషయంలో
అల్లాఅనుకోవద్దు. నేనుఅల్లాచేసేవాడినిగాను. ఆమోస్తరుగా
చెప్పిన జాగీరుదారు యిప్పుడెదురుగావుంటే నామాయలంజ
కొడుకును మక్కెలిరగకొడను. ఏమైనాసరే.

చంద్రి—ఎప్పటిసంగతో యిప్పుడెందుకు అమ్మాయీ!

రామ—అడిగితే తప్పేమిటి[illegible]మానపరహితం చేసుకొంటేమంచిది.

చంద్రి—అనుమానంలేదు గినుమానంలేదు, ఇంకనీవు వెళ్ళుదూ.
[illegible]భోజనంవేళ అయింది.

రామ—మాపటికి నేను చెప్పినాయన్ని తీసుకునివస్తాను.

చంద్రి—మంచిది (నిష్క్రమించును.)

(అందరు నిష్క్రమింతురు.)

---

రంగము:—సింహాచలము—నరసింహము.

నర—(తనలో) నేను చాలామంది వేశ్యలను చూచినానుగానియిల్లాటి అందంగల మనిషిని యెక్కడను చూడలేదు. దీనికి ఇంత అందం వుండడంచేతనే యింతఆస్తి సంపాయించగలిగింది. అబ్బా! ఏమిమేడ! మేడంతా కడపనాపరాళ్ళచేత పఱుపబడి సిమెంటు చేయబడినది.

సింహా—ఏమిటి పంతులుగారు మహాఆలోచిస్తున్నారు?

నర—ఏమీలేదు. నీయొక్కవైభవాన్ని చూస్తే నాకు చాలా ముచ్చటవేస్తూంది. ఆవెంకటాద్రియ్యగారు బ్రతికి వున్నప్పుడింకా యెంతహోషుగా వుండేదానవోగదా!

సింహా—ఆసంగతి యిప్పుడెందుకులెండి. ఆయనమాట తలంచుకుంటే గుండెనీఱైపోతుంది. ఆయన సరసత్వము, ఆయనధర్మగుణము, ఆయనప్రేమ, ఎవ్వరికన్నా వుంటుందా. అల్లాటిమనిషి యెన్నిజన్మాలు తపస్సుచేసినా దొరుకుతాడా!

నర—పాపము చాలాడబ్బు యిచ్చినాడట.

సింహా—ఒకడబ్బేఅన్నమాట యేమిటి! పోనిద్దురూ! ఇంక ఆవూసు యెత్తకండి, అయిపోయిందేదో అయిపోయింది. (ఇంచుకయూరకుండి) తాంబూలం వేసుకొండి. (అని చేతికియ్యబోయి) అయ్యో! ఇదియేమిటి? చేతులు వణకుతున్నాయి. ఎన్నడూ లేదు. ఇదేమిటో భయమేస్తూవుంది.



నర—ఏమిటో నాకూఅల్లాగేవుంది. అదిగో వికృతమైనస్వరూపమొకటి నాకంటికి అగపడుతూవుంది. మీయింట్లో దెయ్యాలుగాని బ్రహ్మరాక్షసులుగాని యేవయినా వున్నాయా యేమిటి?

సింహా—ఎప్పుడూమాయింట్లో అల్లాటివి లేవండీ.

నర—(అదృశ్యరూపమున నెవరో చెంపకాయగొట్టగా) అబ్బా! ఇదియేమిటి, సింహాచలమూ ఏదో భూతంలాగువుంది. ఎదురుగా నిలచుంది. చెంపకాయ గూబలుగుయ్యమనేట్టువేసి ఆత్తేరీ ఇంతడబ్బుదీనికి నేనిచ్చి కర్మంచేత స్వర్గానికివెళ్ళితే నివుదీని దగ్గిరకు వచ్చావా అని గొంతుక్కాయ పిసుకుతూవుంది. ఓయిబాబూ! బోగందానితోసరసంవద్దూ వల్లకాడూవద్దు. ఎల్లాగయినా అవతలపడితే చాలురాబాబూ.

సింహా—(గడగడ వడకుచుండును)

:(సింహాచలమున్నూ, నరసింహమున్నూ హఠాత్తుగా నేలబడుదురు)

నర—(లేచి) వోయి బాబో. చచ్చిన వెంకటాద్రియ్య బ్రహ్మరాక్షసి అయినాడురా బాబూ. ఆయన నన్నుతరుముతున్నాడు. నాపని డబ్బ్బాపోయి శనిపట్టిందన్న మోస్తరుగా వుందిరా బాబూ. ఇంకదీనిగడప తొక్కరాదు. ఎవళ్ళువచ్చినా యిల్లాగే శాస్తి అవుతుంది. (పరుగెత్తుకొని పోవుచున్నాడు)

సింహా—(బిగ్గరగా) అయ్యబాబో! అయ్యబాబో! నాయినో! (కేకలు వేయును.)

[చంద్రివదన ప్రవేశించును.]

చంద్రి—(ప్రవేశించి) ఇదేమిటే! ఈలా కేకలువేస్తావు?

సింహా—అదుగో బ్రహ్మరాక్షసి. నామీదకు దూకుతూవుంది. నా గొంతుక్కాయ నొక్కేస్తూవుంది. నన్ను చెంపకాయలు వేస్తూ

వుంది. నేను ఎంతో దబ్బయిస్తే విశ్వాసం లేకుండా పురియొక్క
రిని చేరనిస్తున్నావా! అని అంటూవుంది.

చంద్రి—(తనలో) ఇదెక్కడమాయపీడ. ఇదంతా వెంకటాద్రియ్య
గారి చర్యలావుంది. చచ్చినవాడు చావక దయ్యమై దీన్ని
బాధించడం మొదలుపెట్టినాడు. బాగానేవుందిఖర్మం. భూతవై
ద్యులను బిలపించియిందులకు తగిన గట్టిపని యేదయినా చే
యిస్తేనేగాని లాభం లేదు. (ప్రకాశముగా) అమ్మాయీ! భయ
పడకురా ఏమీలేదు. ఏదో కాస్త జడుసుకున్నావు. (లోపలి
తీసుకొని వెళ్ళిపోవును.)





సంపూర్ణము.





| | | | |
|---|---|---|---|
| ప్రబోధచంద్రోదయము | ... | 0 | 8 |
| చమత్కారరత్నావళి | ... | 0 | 4 |
| ప్రహ్లాద | ... | 0 | 8 |
| వైదర్భీవిలాసము | ... | 0 | 10 |
| సాంబ్రాజ్యోదయము | ... | 0 | 8 |
| [illegible]పత్నీపరిణయము | ... | 0 | 12 |
| నందచరిత్ర | ... | 0 | 4 |
| సాక్షి | ... | 2 | 0 |
| జయచంద్రవిజయము | ... | 1 | 0 |
| యశస్తిలక | ... | 0 | 10 |
| శ్రీదేవి | ... | 0 | 10 |
| లలితకుమారి | ... | 0 | 10 |
| విద్యాపురసంస్థానచరిత్ర | ... | 0 | 10 |
| కలనీచంద్రశేఖరము | ... | 0 | 12 |
| ముక్తిమతి | ... | ( | 10 |
| ప్రమీలార్జునీయము | ... | 1 | 2 |
| ప్రహ్లాద | ... | 1 | 2 |
| సావిత్రీచిత్రాశ్వనము | ... | 1 | 2 |
| చంద్రహాస | ... | 1 | 2 |
| బృహన్నల | ... | 1 | 2 |
| పాంచాలీస్వయంవరం | ... | 1 | 2 |
| చిరకారి | ... | 1 | 2 |
| సీతావిజయము | ... | 0 | 12 |
| రావణవధ | | 0 | 12 |
| ప్రసన్నపాంచాలీయము | ... | 0 | 12 |
| రాణీసంయుక్త | ... | 0 | 12 |
| చారుమతీనందివర్ధనీయము | ... | 0 | 10 |
| వాసంతికాపరిణయము | ... | 0 | 1 |
| ప్రతిజ్ఞాపాలనము | ... | 1 | 8 |
| శ్యామల | ... | 1 | 8 |
| మాతృమందిరము | ... | 1 | 8 |
| మాయావిని | ... | 0 | 12 |
| చిత్రలత | ... | 0 | 6 |

వలయువారు:—

కురుకూరి సుబ్బారావు,

బుక్కుసెల్లరు, భీమడోలు.

